శ్రీ

# దక్షిణోత్తర గోగ్రహణములు.



నాంది.

ఉ. శ్రీకరకంజమున్ దనవ-శ్రీకరమంతలొ జేయుజాలు శో
భాకరమైన చక్షుల ని-శాకరకాంతిఁ జెలంగుదృష్టి ర
త్నాకరరాజపుత్త్రిని ప్ర-భాకరవక్షతలంబు నందు ధ
ర్మాకరుఁడై ధరించిన ద-యాకరుఁడెప్డు శుభం బొసంగుతన్.

నాంద్యనంతరము.

[సూత్రధారుడు ప్రవేసించి సభను వీక్షించి.]

ఆహా! నేడేమి నాపుణ్యము కనుదమ్ముల కతి వినోదమ్ముగ సభల పండిత పుండరీక తండంబులచే మండితంబై యీసభాస్థలంబు ప్రభాసితంబుగా గానంబడుచున్నది.

షాబాష్. యీసభాకరంబు శోభాకరంబై కల్పద్రుమంబనాబరఁగి వేద వేదాంగ తర్క-వ్యాకరణ-ఛందో మీమాంస పురాణేతిహాస వికాస నూతనవాణీవిలాసులగు భూసురపుంగవశాఖలచేతను సకల మణిగణ భూషణకిరీట కుండలాంగదాది ప్రకాశమాన రాజభాస్కర ప్రకటి గర్వ నిర్వాహ నిశ్చేద భ[illegible]ల కలిత మండిత భూమండలాధిప కిస లయంబులచేతను నవరత్న శాతకుంభ వ్యాపార పారీణులయి దేవ బ్రాహ్మణపూజాయత్తచిత్తులగు వైశ్యోత్తమ పుష్ప గుచ్ఛంబులచేత ను అనవరత ధనధాన్య సంపత్సమృద్ధిచే గురుబుధబ్రాహ్మణపాదపద్మ చింత నాభ్యాసానురక్తులగు బ్రహ్మపద సంభూత ఫలంబులచేతను, మెండుగానిండియున్న యది శహబాష్. యీపందిలి యందంబును యీపటంబుల యాటోపమంబును యీరంగస్థలింగల పండిత పుం గవులంగాంచి యీరాబోవు పిన్న వేషధారు లతిసుధామయవాక్ప్రి

సంగ సుసంగతులచే నెట్లు సంతసింపజేతురో గదా కాదేని చారు
చిన చిలుక వచ్చిరాని వాక్యంబులు బలుక నవి చెవులకు ముకుల
దలంచక నెటుల విని యానందింతురో యటులనే యీపిన్న వేష
ధారుల చిన్నిమాటలంగల లోపంబులెన్నక నాలించుడు మరి యీ
న్నింటియందును మిన్నగల వార లెవ్వరైనా యుండిరేని దెల్పుడ
చూతము.

క. మానితపు నడక పేరిమి
మానసమున కింపు బెంపు-మనునంచలకున్
బోనిడినీరస నీరము
జాలుగ క్షీరంబుగొనుట-సహజము కాదే.

అనగా హంసలెట్లు నీరక్షీరంబుల వేరుజేసి నీరసంబగు నీరంబుల విసర్జిం
చి సారంబులగు క్షీరంబుల బరిగ్రహించునో అటులనే మీబోటి సజ్జ
నులు తప్పులబోనాడి యొప్పులనే సంగ్రహించెదరని నమ్మియున్నా
డ నల్లుగాదేని.

ఇసుకయందలి తైలంబును, కుందేటికొమ్మును, యెండమావులలో నీళ్ళ
ను సాధింపవచ్చును గాని ఛీ! నాబోటి మూర్ఖుని సంతసింప జేయ
నేరికి శక్యముగుగాన. యిప్పుడీ నాటక మాదిమొదలుకొని యంత్య
ముదనుక నాటపాటలయం దతి నిపుణత్వముగల మేటీల సకలాభి
నాభినాషితులంజేసి యిందు రప్పింపుచుండుటకై నాప్రియురాలగు
టిని రప్పించుచున్నవాడ.

ప్రియసఖ! నటీ నీవిందురమ్ము.

(నటిప్రవేసించి.)

నటి. నాథా! నమస్కారము.

సూ. శుభము గాక.

నటి. నాథా! నన్ను బిలచినకారణం బెయ్యదో సెలవీసంగుడు

# వి క్ర...

...సరస్వతీ బుక్ డిపో, బెజవాడ

శ్రీమేధా దక్షిణామూర్తయేనమః

# వెంకటే...

శ్రీగణనాథుని గొలిచెద
భోగివి భూషణుని భుక్తి-ముక్తి ప్రకుసిక్
నాగేంద్ర హారశోభితు
వాగధిపతి వినుతు భవ్య-వాగమృతసిద్ధిక్

జనతా ధురీణులార చిన్న విన్నపం బుపన్యసించెద సావధానులరై యాలకింపుడు. సర్వలోక సామన్యముగా విద్యయనియు అవిద్య యనియు ను రెండువిధములు అందువిద్యయనగాన విద్యావిని వర్తకము. అవిద్యయనగా నహంకార రూపమైన యజ్ఞానము తన్నివర్తకముగాన విద్యయనగా జ్ఞానము అట్టిజ్ఞానము తన నాశ్రయించువారిని సుజనులనియు, విద్వాంసులనియు, వేత్తలనియు, శుద్ధులనియు, శుచులనియు, సర్వోత్తములనియు, నామధేయముల నమర్చి ఇహపరలోక సమస్త భుక్తి ముక్తి సాధనమై ప్రవర్తించుచున్నది గాన విద్యాలాభమెల్లరకు సంతోషజనకము. అవిద్య యందరకు నన్నివిధముల సంతాపజనకము ఇటులుండగా నట్టివిద్యా విద్యాద్వయమున మనమెద్దానినాశ్రయించి సుఖమునొందుదుమో విచారించుకొవలయును జ్ఞానంబున సమస్తప్రపంచమును తెలుసుకొని హేయోపాదేయముల వివేచనముచే సుఖలాభ సిద్ధినొందెదరు తత్సుఖలాసిద్ధి హేతుజనకమైన విద్యసామస్త్యము గాపదునెనిమిది విధములు గా వ్యాపించుచున్నది అవియెవ్వియనగా వేదములు నాలుగు. అంగములారు మీమాంసమొకటి న్యాయమొక్కటి పదునెనిమిదివిధములుగా ప్రకాశించుపురాణజాతమొక్కటి. ధర్మశాస్త్రమొకటి సర్వప్రాణిసుఖారోగ్యకారియ

గున యజుర్వేదమొక్కటి గాంధర్వవేద మొక్కటి ధనుర్వేదమొ
క్కటి శిల్పమొక్కటి యనివగునెనిమిది విధములు గాప్రమరముగా
వునమానవునకు జ్ఞానవిజ్ఞానములకు మూలమీవిద్యలై యున్నవి యేత
దంతర్గతములైనానావిధరహస్యవివేకప్రదాయకగ్రంథజాలమితంయని
వచించుటకుదుర్లభముచాలా కాలము శ్రమచేసినను నామోచ్చారణ
గణనమున క్లేశప్రయాసములును గాన ముఖ్యముగా సర్వామోదకరము
సర్వసుఖకరమునైన జ్ఞానము గురుసంప్రదాయాగతమైన విద్యాజన్య
మేగావున నట్టివిద్య సర్వమనుష్య కోటియుసాధించతగినది మానవసు
లభము గానికార్యమెద్దియుగానము ఇట్టిజ్ఞానముసత్సంప్రదాయాగ
తమై బ్రాహ్మణాదివర్ణ వ్యవధానమునగురుశిష్యన్యాయ రూపము
నాపాదలి మైస్త్రీపురుషులకు నుపయుక్తమైవర్ధిల్లినలయును.



# నాంది.

సూ. క. పాత్రాపాత్రం బెఱిగి వి
చిత్రాభరణముల బెట్టి శీఘ్రముగా స
త్పాత్రల నిటు బంపుము సభ
నేత్రోత్సవముంగ నటుల నేర్పుతోడన్.

మాట. నేనిచటగల సూత్రంబుల నెల్ల చిత్రవిచిత్రంబుగాఁ బిడికిటఁ బట్టియుం డినాఁడఁ గాన నీవు సత్వరంబుగాఁ జని పాత్రల నెల్లర నతిశృంగారంబు గానొనర్చి యిందు రప్పించుము.

న. నటకులందఱు సిద్ధముగానేయున్నారు గాని యీగ్రంథమును రచిం చిన కవిపేరేమో.

సూ. కవియెవ్వరైనది యింతవరకు నీవెఱుంగవా. అట్లైన.

ఉ. ధీరతముండు సజ్జన వి-ధేయుఁడు శాస్త్రవిశారదుండు గూ-
డూరి కులాబ్ధిచంద్రనిభు-డుర్వి సుగుణోన్నతు మల్లయాఖ్యునిన్
భూరిసుతుండు వెంకటశి-వుండతిసంతస చిత్తవృత్తిబల్
నేరుపుమీర వ్రాసెనిది-నిర్మలితంబగు నాంధ్రభాషతోన్.

నటి. ఆలాగా ఇంతకుమున్ను తారాచంద్రవిలాసము రచించిన గూడూరి వెంకటశివకవియేనా.

సూ. అవును మనమిచ్చోట గాలయాపనఁ జేయఁదగదు. ఎందుకన. నవఖండమండలాధీశ్వరుండగు దుర్యోధనచక్రవర్తి యీసభాస్థానము నకువచ్చుచున్నట్లు దోచుచున్నది. మనముపోదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమించిరి)





# దక్షిణగోగ్రహణము

## ప్రారంభము.

---

దుర్యో. మంత్రులారా పాండవు లజ్ఞాతచర్య నెఱవేర్చి వచ్చి తిరుగ రా
జ్యభాగమును కోరకమున్నే వారివచ్చుటచ్చుటఁ గలయ వెదకి గాంచి
మరల నరణ్యమందు దొల్లిటియట్ల పదిరెండు వత్సరంబులు కాపురం
బుసేయునట్లు జేయఁదలంచితిని (యోచించి) చూడగా నట్లు సేయు
టదుర్ఘటంబని యోచనగల్గినది పాండవులజాడ నెవ్విధిగా దెలియవ
చ్చునో? మీమీయెఱింగిన తెఱంగుల నాకెఱుకపఱచుడు.

దుశ్శా. అగ్రజా మీరింక శంకింపక నామనవి నంగీకరించెదరా.

దుర్యో. అంగీరించకేమి.

దుశ్శా.

ఉ. జూదమునందు పాండు నృప-సూనులనోంచి ధనంబు రాజ్య సం
పాదనజేసి ద్రౌపదిని-బట్టి సభంగడు భంగబెట్టగా
నేదరిదోచక న్మదిని-సీయనియంచు నగంబుజచ్చియు
న్నాదమునెత్తి నెంజిలిని-నాలిగఁబోయిరి వారుగానమేఁ

ఆకౌంతేయుల కొరకు బ్రాణంబులు కూడా యెప్పుడు పోవచ్చు నంటిరేని
దెల్పెద వినుము.

గీ. పాండవులరణ్యములపాలు-బడిన యప్పుడె
చచ్చిరచ్చోటబూరివి-శ్రమము లేక
తొలచియుండును మీరు స-మ్మోద మెలర్ప
రాజ్యలక్ష్మినిగొనఁదగు-రాజసముగ

కర్ణు. రాజేంద్రా! యీ మనుస్సన్నీనుని మాటలని మీరల శ్రద్ధగా నుండవ
గదు. యోచించగాఁ, బాండవేయులు పంచత్వ మందియుండరు.
కావున మనము చేయువలసిన కార్యమెద్దియంటిరేని మంచి నేర్పరుల
ననేకుల ననేకవేషములచే నఖిలదేశంబుల నరయబంపితిరేని వారి
జాడఁ దెలిసికొని రాగలరు.

ద్రోణు. (చిఱునవ్వుతో) దుర్యోధనా ఆర్యులచే వర్ణించదగు నవార్యబ
లవిక్రమోపేతులగు పాండవుల కేవిధమైన కష్టంబులును గలుగఁజా
లవు. అట్టి పుణ్యపురుషులు మరణమందుదురనుమాట నమ్మదగునా
నీతమ్ముడగు దుశ్శాసనుఁడు యథేశ్చగా రాజ్యలక్ష్మి లక్షణమును గొ
నియాడుమని గొప్పగా జెప్పుట వింటివిగదా పాండవులు చచ్చినచోట
బూరి మొల్చుటయు మీరీరాజ్యంబెల్లఁ బరిపాలనఁ జేయుటయు నిశ్చ
యమే (యోచించి) కానిమ్ము నీవిట్టిచెడుమాట లాలించక భూతలం
బునందెల్లెడల మీ నేర్పరులంది కౌంతేయుల నరయుసంగతులఁ జె
ప్పకొని యట్లుసేయసమకట్టుము.

భీష్మ.—

ఉ. మానవనాథ యీగురుని-మాట నిజంబునుడీ గనంబ్రు ధా
సూనులు ధైర్యశాలులతి-శూరులు దైవబలాఢ్యులౌట మిం
చానిపానంగ దాపదల-పాయనిదూరము బోవుధర్మ సం
తానముగల్గు కారణము-వర్ణ నినుమెక్కటి చెప్పి దేర్పవర్.

కౌరవేంద్రా! మాకు మీరును వారును నొక్కటియేయగు నైననుమీ
రుముందు కార్యాలోచన నాచేవినఁదలఁచినారు గావున నేను జెప్పినరీ
తి జేయుబూనుఁడు.

దుర్యో. అలాగే జేయువారము.

భీష్మ.—

ఉ. ధర్మనృపాలుకున్న వసు-ధాతలమందలి మానవోత్తముల్
నిర్మలచిత్తులై బరమ-నీతిని బ్రాహ్మణ భక్తిగల్గి స

ర్క-ర్కలోనగ్బుచుంబరహి-తంబగు నత్య వచోవిలాసులై
ధర్మము చెలభించు ధన-ధాన్యసమృద్ధి గనుందు రెప్పుడున్.

ఆ. వె. దుష్టశిక్షణమును-శిష్టరక్షణమును.
జ్ఞాతిప్రీతి నతిక్ర-వాతిశయము,
సాధుపోషణమును-సౌజన్యమును వితి.
గుణము పాడికో లంల-రాక యుండు.

దుర్యోధనా యిట్టి శుభలక్షణములచే నెప్పుడేశంబెద్దిదో యందుంగుం
తీకుమారుల నరయదగిన చారులబనిపి వారి జాడ దెలసికొనుము.

కృపా. క. గంగాపుత్రుఁడు దెల్పిన
సంగతి నిక్కంబు పాండు-సంతతి నెన్నో
భంగుల నరసినవారల
సంగతిబోధయగు గాక-సామాన్యంబే.

అశ్వ రాజేంద్రా అజ్ఞాతవత్సరంబు కొద్దిలో నతిక్రమించు గావున జా
గు సేయక నిర్విఘ్నిగానైన సమయభంగము జేయుట మేలగును. కాదే
నిమనము తగినరీతి నన్వేషించవారగపడకున్న సంధి సమరోద్యోగంబు
లు సేయుటొప్పు.

దుర్యో. గురు, భీష్మ, కృపాశ్వత్థామాది యోధులారా నేనిపుడు తగువే
గులవాండ్రచే పాండవులజాడఁ దెప్పించెద.

ద్రోణుడు, మంచిది విచారించుము.

దుర్యో. కర్ణా వేగులవాండ్ర వచ్చునట్లు జేయుము.

కర్ణ. (సేవకునిజూచి) సేవకా రాజాజ్ఞయైనదని వేగులవాండ్ర దోడ్కొని
· రమ్ము.

సేవ. అయ్యా! చిత్తము.

[సేవకుఁడు నిష్క్రమించి వేగులవాండ్రతో ప్రవేశించుచు.]

వేగుల. రాజేంద్రా! వందనములు.

దుర్యో. మీకు జయమగుగాక.

వేగు. స్వామీ మమ్ము బిలుపించినకార్యమెద్దియో యానతిండు.

దుర్యో. మీరలిద్దారుణీతలంబెల్లఁ గలయంబరికించి పాండు కుమారుల గాంచి యజ్ఞాతవాస భంగంబు గావించి తిరుగ పాండవేయుల వనముల కంపించిరందు.

వేగు. అయ్యా! మాకదెంతటిపని పోయివచ్చెదము.

[చారులు నిష్క్రమించుచున్నారు.]

విరటుడు. సుధేష్ణ,పరిచారిక, పురోహితుడు ప్రవేశము.

విరటు.బ్రాహ్మణోత్తమా! కంకుభట్లవారునిన్న టిరోజు ఆశౌచవిషయమై.

శ్లో. దశాహంబ్రాహ్మణానాంతు। క్షత్రియాణాం త్రిపంచకం. అని శెలవిచ్చియుండిరి అందుచే పక్షముదినములా శౌచముతో నుండ నవసరముకద్దా.

బ్రాహ్మ. లేదు. లేదు.

శ్లో. శుద్ధేద్విప్రోదశాహేన ద్వాదశాహేనభూమిపః।
వైశ్యఃపంచదశాహేన శూద్రోమాసేనశుధ్యతి।

అను స్మృతిప్రమాణంబు బట్టి సింహబలాదుల భార్యలనీరోజునసే శుద్ధిస్నానము జేయుంచవలయును,

(సుధేష్ణవిని దుఃఖముతో.)

సీ. సింహవిక్రమనీవు-సిగ్గుబోవిడిరాజ
వీథిని సైరంధ్రి- వెంటనంటి
సింగమేనుఁగుబట్ట- జెంగునఁజనురీతి
బరుగిడుమాలిని-బట్టుకొంటి

పాయుపు చేకూతి। నదినాడాయసుకొంటి
చాలునీకిది కాగ। మేలటంటి
నాలస్యమొకక్షణం। బైనఁజేయుమనుచు
చంపు నన్ను నియెన్వ। జాలిగొంటి॥
తే॥గీ॥ నెట్లుకోఁజత్తువని। మదినెంచుకొంటి
మంచిచెడ్డలుగనకనీ। మాటవింటి
ప్రేమదీరంగనిన్ను జం। పించుకొంటి
న్యాయహీనుండువిధి। యిట్లుజేయఁగంటి॥

హా॥ తమ్ముడా హారిబలా పదిరెండుదినంబులక్రిందట మమ్ము నీవుమరచి పోయినను నిన్ను మేముమరచి క్షణమైనయుండలేముగదా నీపైగల మక్కువ పెక్కురీతుల మమ్ము మనోవ్యథబెట్టి విడువకుండెగదా అక్కటా ఒక్కసారినూర్వురు తమ్ముల దిగమ్రింగుకొని ప్రజల ముఖముజూడ బ్రదికిన నిర్భాగ్యురాలను కఠినురాలను పాపిని నేను గాక యీలోకమందింకెవ్వరుండిరి హా సైరంధ్రీ కీచకులపాలనకాల మృత్యువు కతి జనుదెంచి యొక్కసారి నూర్వురతమ్ములఁబొట్టను బెట్టుకొని తృప్తిఁబొందితివిగదా॥

పరి॥ దేవి. ఊరడిలుము ఊరడిలుము ఇప్పుడా సైరంధ్రి దోషమేమి గలదు పరసతినిఁబట్టఁదలఁచిన పాపకృత్యమే యీహారిబలునకు కాల మృత్యువైనది ఇదిగాక నాసింహబలుని పాడెపై నపతివ్రతా రత్నంబునుబట్టి కట్టినపాపఫలితమే యతనితమ్ములఁదోడ్కొని పోయినది మృత్యుదేవత నెట్టుకొని వచ్చినప్పుడడ్డ పడ గలవారెవ్వరు॥

సుధే॥ అవును ఆమహాపతివ్రతయెడల దోషములేదు అతిపాపురా లనగు నేనే సురనెపంబున సైరంధ్రిని హారిబలునియింటికంపి కొం త పాపము మూటగట్టుకొని తుదకు నూటయేవురుతమ్ములను నాపొట్టనేబెట్టుకొంటిని వినాశకాలముసమీపించి నప్పుడిట్టివిపరీ

గబుద్ధులు గల్గుగాబోలు హా దైవమా నాకెటుక లేకబోయెగదా నేనేమి సేయుదు.

పరి. దేవీ అదినీదోషమా విధివ్రేరేపణ అట్టివిధిని దప్పించుకొన శక్యముగునా॥

సుధే॥ నిజము (యోచించి) హోతమ్ముడా నామాట నాడుచెవిజొర కపోయెనే ఇప్పుడైన ననుభవమై చెవిజొచ్చెనా।

విరాటు. ఉ॥ చక్కెరబొమ్మ వేదురగల। చాన్పున నేడ్చెదుపుత్రులంత బెంపెక్కినగుండె బ్బద్దలగుచు। నేడ్వగసాగుదురిట్లుసేయగాఁ జక్కనయౌ నెయూరడిలు। చచ్చినవారలులేచివత్తురే యెక్కడిసోదరవ్రజమదెక్కడ। మక్కువలేలవారిపై॥

సారసాక్షీ నీతల్లికడుపునందా కీచకసంఘంబుద్భవించనే లేదనుకొని పలువరించుటమానుము.

సుధే॥ నాధామీరెంతమాటడితిరి ఆడవారికిసోదరస్నేహము మించిన దెద్ది అఖిలబలశౌర్యోపేతుండగు సింహబలుని ప్రాణంబులుగొన్న గంధర్వులెంతి బలవంతులోగదాయని కంపమెత్తుచున్నది.

విరా॥ పాటలాధరీ పాపాత్ములజంప బలవంతులతోఁబనిలేదు వాని పాపమేవాని కకాలమృత్యువై వెన్నంటి క్షణకాలంబులోఁగాఁ జేయును గడచిన పనికంతగా జంతిలుట గతజలసేతుబంధనము గాక లాభమేమిగలదు ఊరడిలుము నీవాసైరంధ్రితో నేనుజెప్పు మనినసలగతి చెప్పిపురినుండి పాగనంపితివా॥

సుధే॥ ఎన్నివిధములఁజెప్పినను పురివెడలి పోయినదికాదు.

విరా॥ నీకేమిబదులుచెప్పినది.

సుధే॥ ఇంకా పదమూడుదినములవరకు మీయింట నుండనియ్యకొంటివేని మత్పతులప్పుడు ప్రత్యక్షమై తగినబహుమానము జేసి నన్నుగొనిపోయెదరని వేడుకొనినది.

విరా॥ నీవామాలిని ప్రార్థనకియ్యకొంటివా।

సుధే॥ మీ కేమి యపాయము దేజూచునోయను భయకంపంబుచే నొ
  ప్పితిని॥

విరా॥ నేడేకదాతుదిదినము.

సుధేష్ణ (దుఃఖంబుతొ దలవంచి)

తే॥ అకటపరసతికై కీచ। కాగ్రజుండు
  మరణమందినదినములఁసరణినెఱిఁగి
  చెప్ప నోరాడదికనేమి సేతునాస
  దోసమునుదెచ్చిపెట్టెను। గ్లానముగను॥

హా! దైవమా నీకాకీచకులపై దయరాకపోయినను ఆగంధర్వులైన
  పితృదేవతలకు తిలోదక పిండోదకములకొరకొక్కనినైన వదలి
  వేయగూడదా.

పరిచా॥ అమ్మా మఱిమఱితలంచుకొని యేడ్చుటచే నీతమ్ములు లేచివ
  త్తురా చాలుచాలు రాజుగారిడిగిదానికిసమాధానముచెప్పుము.

సుధేష్ణ॥ (విచారించి) నాధా ఇదేపదమూడవదినము.

(అందరువిస్మయించిరి)

చారులు (దుర్యోధనునిరంగమునకు ప్రవేశము.)

చారు॥ తే॥ దండములుమీకుకౌరవా। ధ్యక్షమేము
  దుర్గములుబులుగుహలును। దోనలుశిలలు
  కవములునుపల్లములుపొదల్। గాంచిగాంచి
  విసిగితిమిపాండుసూనుల। వెదకి వెదకి॥

రాజేంద్రా మేము చెట్టుచెట్టు పుట్టపుట్ట గుట్టగుట్ట మిట్టమిట్ట వెదకి
  వెదకి పాండవులజాడ దీయజాలక చిట్టచివరకొక్కయెడ నరదం
  బు లరిగిన త్రోవఁబట్టి పోవ పోవ ద్వారకకుజేరితిమి యచ్చట
  కూడ పాండవులజాడ దెలియని కతంబున తిరుగ వెడలి సకలదే
  శంబులు గలయం దిరిగి తుదకొక్క విశేషంబెఱింగి సంతోషంబు
  గా దేవరవారి సన్నిధికి వచ్చితిమి॥

దుర్యో॥ మీరెఱింగినవిశేషంబెయ్యది.

చారు॥ ఆ॥ వె॥ అధిపవిరటుమఱదియౌ। గీచకునిరొుక్క-
కోమలాంగికతన। గుట్టుమీఱ
నర్ధరాత్రివేళనడచిరి। గంధర్వు
లాయుధములపనులఁ। జేయకుండ॥

ఇంకొకవిచిత్రంబుగలదు అడియెద్దియన శిరంబును కరచరణంబులును డొక్కలోనికి జొరఁద్రోచి పీనుంగు నొక్కముద్దగాఁజేసి యతని తమ్ములం దొక్కనినైన బీఱువ్రానీక యారాత్రియే ధారుణీస్థలంబున కర్పించి గంధర్వులరిగిరని వింటిమి యవ్విరటుండు మనకు పగవాఁడగుటచేతను అతండిపుడతి చింతాక్రాంతస్వాంతుండగుటచేతను సాధించుటకిది సమయమని యీసంగతిం దేవరవారికి విన్నవింప వచ్చితిమి మీదమాకేమి యానతిచ్చెదరు॥

దుర్యో॥ (తలయూచుచు) చారులారా మీరుమార్గాయాసంబుచే బడలియుండితిరి గాన మీరిపుడిండ్లకేగి శ్రమదీర నీరేయినిద్రించి మొల్లి ప్రొద్దుపొడువకముందేరండు॥

చారు॥ చిత్తము. [చారులునిష్క్రమించిరి.]

దుర్యో॥ యోధాగ్రేసరులారా వేగులవాండ్రు వచించిన దెల్ల వింటిరిగదా.

భీష్మ॥ ఆహా! వింటిమి.

దుర్యో॥ (యోచించి)

క౦॥ హలధరుంను। శల్యుఁడును హరి
బలుఁడునుభీముఁడు। సమానబలులిలలోన
నలువురుభుజ। బలయుద్ధప
టులువీరలలోన। నొండొరులకనిజయమౌ॥

ఈనల్వురకును సమానమగు భుజబలము కలిమిగలవా రివ్వసుంధరలో నచ్చటవెదకినను గనుబడరు శల్యునకును బలరామునకు

ను కీచకునిజంప నవసరమేమిగలదు ఇదిగాక వారిర్వురును చా
లా దవ్వులనున్న కారణంబున కీచకుని కొంకిచటికి వచ్చుమాట
కల్లయని మనోదృఢముగా జెప్పవచ్చును [యోచించి] దీనికింత
యోచన యేల మనపాండవులే ప్రచ్ఛన్నవేషంబులచేత నామత్స్య
దేశంబునందు తలదాచుకొనియుండిరి ఇందుకుసందియములేదు॥

కం॥ ఎందుకనఁ గీచకుండతి
సుందరి ద్రౌపదనిగోరఁ జూచికొంకకొఱ
గంధర్వ బేరఁ మారుత
నందనుడేసింహాబలుఁ దుంచెనుజూడన్॥

అట్లుగాదేని గర్వాంధులగు కీచకప్రకరంబు నణంచనేరికి శక్యమగు
ఇదియటుండ భీష్ముండు చెప్పినశుభలక్షణంబు లాదేశంబుననే
గలవనివిందుము ఇప్పుడు మనమువ్విరటుని పురిబాహ్య ప్రదేశంబు
నంగలయుతని గోధనంబు గ్రహించితిమేని యదియెట్లుగి ధర్మరా
జు తమ్ములతో సహా బయిలెంచు వెంటనే॥

తే॥ సమయభంగంబువారికి- సంఘటిలుట
దెలిపిమఱివనవాసంబు- సల్పఁబంపి
యాదుకు లేనిబీరంబున- నిగ్రహితి
నెల్లనేలుచుఁగీర్తిస- మృద్ధిజేసు॥

ఇదియటుండ నమ్మత్స్యదేశంబున పాండవులు లేకున్న విరటునిపురం
బునగలవెల్ల జూదగొందము మనకెల్లైన లాభంబేయగు మీద
నిందుకుదగు నుద్యోగంబుసేయుడు.

కర్ణు॥ దుశ్శాసనా, భీష్మ, ద్రోణ, కృపా శ్వత్థామలాదిగాగల యో
ధులెందఱోయుండగా నీసభాస్థలమందు రాజుగారికొక్కరికి తక్క
యుట్టియుక్తి యింకెవ్వరికైనఁదోచెనా శహబాష్ ఆవగింజంత
యుఁవకాశమున్న కొండంత యూహజేయఁగలవాఁడు గనుకనే సు

యోధనుడను సార్థకనామము చెల్లినది.

దుశ్శా॥ ఉ॥ సాధుతనంబున న్విరటు-సన్నిధి దైవ వశంబుచేతనో।
రాధకుమార యీకురువర- ప్రభుడన్నటులందెయున్నచో।
యోధులలోన నొక్కఁడును- యోధను బుద్ధిబలంబు మేధహ్యా।
ద్వీధులఁ జేర్పరంచుఁ బృథి- వింబొగడందగు నెల్లభంగులన్॥

కర్ణు॥ అబద్ధమేమియున్నది.

సుశర్మ॥ (లేచినిలచి)

తే॥ రాజరాజేంద్ర కీచకా- గ్రజుఁడు వేడ్క।
నాఁడు కేకయసాళ్వురఁ- దోడు గాఁగ।
వచ్చినాతోడఁ బోరియ-ప్పజయమంది।
బోయెనాడతఁ డొకడైనఁ- బోఁగలండె॥

నన్ను మున్ను భంగపఱచిన సింహబలునితో సంగరము సమకూడకపోయి నది ఐనఁ జెప్పుడు మిగిలిన దేమిటి యతని మఱఁదియగు విరటునిబట్టి కనుగాసిసెట్టి సప్తాంగంబులఁ జూరబట్టి దెచ్చుటకు నతని గోగణంబు లన్నిఁ కొల్లగా గొట్టి మనదెసకు మరల్చుటకును అందుకవ్విరటుం డడ్డపడ నచ్చో పాండవులఁ గనుగొనుటకును నేనే చాలినవాఁడను.

కర్ణు॥ (నిలచి) సందేహమేమి యీపనినెఱవేర్పగలవాఁడవు నీవుగాక యీసభాస్థలిని కెవ్వరుండిరి. [దుర్యోధనుని దెసఁజూచుచు] రాజేంద్రా యీసుశర్మ చెప్పినంత చేయశక్తిగలవాఁడు గాననికార్యసఫలతకై యితనినే బంపుటుచితంబగు నైనను మీకును తక్కిన రాజులకును నెద్ది యిష్టమో యట్లనే సేయఁబూనుడు.

భీష్మ॥ దుర్యోధనా యీరాధేయుని వాక్యంబమోఘంబు నీవిప్పుడనె ఆవేర్పుట కీత్రిగర్తనాథునకే సెలవొసంగుము.

దుర్యో॥ సీ॥ దుష్పసేనాకర్ణువొద్ద వాక్యంబుల
కీసభాసదులు సంతృప్తులైరి
బలములెల్లను రొంపుఘాయములు గాబన్న

ముందటఁ గల సుశర్మని బలంబు
బహుపరాబహుళ ష్టమిని గోవులనుబట్టు
మత్స్యేశ్వరుఁడు శౌర్యమహిమ వెలయ
సేనలఁ గైకొని చెచ్చెరనీసుశ
ర్మను దాఁకు వేళఁగా మనబలంబు॥

తే॥ గీ॥ నవమిరోజున గోగ్రహణమునకరిగి
కొన్నిఁటినిబట్టగా నంతఁ గుంతిసుతులు
కయ్యమునరింప వత్తురు- గానవారి
నరయఁగావచ్చు వనములఁ గనుపవచ్చు॥

(సుశర్మనుజూచి) సుశర్మా ముందు నీబలంబుతో నడువుము.

సుశర్మ॥ చ॥ ఘనముగ దుందుభుల్ మొరయఁగాఁ జనిమత్స్యపురంబుముట్టడిం
చినవిని యవ్విరాటుఁడటఁ జివ్వనయుద్ధంబుగ వచ్చెనేని యా
తనిపెడకేలఁ గట్టి పడఁ దన్నెద గ్రోవ్వడగంగ మిత్తెదన్
మనుపటి వైరమీతఁడిన మోఘముగాఁ దెగదీర్పఁగాంచితిన్॥

భవదాజ్ఞాబద్ధుఁడనై పోయివచ్చెద.

[సుశర్మ బలముతో నిష్క్రమించును.]

భీష్ముఁడు॥ (తనలో) ఏమిప్పటికిఁ దల్లకావరము మీఁసభాసదులందఱును యెం
త తెలివిగలవారలు పాంచాలితోసహా పాండవులాచరించు గూఢ
చర్యావత్సరంబాసాంతంబయ్యెనని యియ్యెడ స్థానంబునఁ దోఁకకుండై
న దలంచక సుశర్మను దక్షిణగోగ్రహణంబు కొఱకంపనతండుపో
యెనైనను ధర్మోవర్ధతి వర్ధతియనునట్లు పాండవేయులను వారిధర్మ
మే కాపాడుగాని యెవరుఁగాపాడఁగలరా యీవిషమవత్సరంబా
సాంతంబగువరకు వారలను ధర్మదేవత వెన్నుదన్నియుండ నీక్రూ
రాత్ములుకనుగొనియుండిరా॥

దుర్యో॥ దుశ్శాసనా మీరు పాండవులని మనమునిరూపింప భీమార్జున
నకులసహదేవులు సత్తులై విడివడ ధర్మజాంకుశనిహారిచే మరలి

ధర్మపాశముచే నిబద్ధులై తిరుగ నందఱు నరణ్యమార్గముఁబట్టిపోఁగ మొదటేంది మరి పైకి యుద్ధమున కరుదెంచెదరా బాగుగా యోచించుము.

దుశ్శా॥ అన్నా సుయోధనా. యిందుకై సందియపడఁదగదు. ఎందుకంటిరేని. ధర్మజుఁడధర్మమార్గంబు చేలభించు మహేంద్రపదవినైనను తృణముగాఁ జూచి విసర్జించువాఁడుగాని యాశించువాఁడుగాఁడు. ఇవియటుండ.

ఆ॥ వె॥ దినకరుండు శైత్య। తేజంబుదొరఁగిన।
నగ్ని చల్లబడిన। నబ్జవైరి।
వేడిఁబూననేని। పిడిసడిధర్ముండు।
ధర్మమునుదొరంగఁ। దలఁచఁడెపుడు॥

దుర్యో॥ ధర్మరాజధర్మమునకురాఁడేని తిరుగబదిరెండు వత్సరంబులరణ్యవాసంబును ఒక్కయేఁడజ్ఞాతవాసంబును వారికిచేకూడినదే

దుశ్శా॥ చం॥ కురుకులనాథ మీకుగల కోరికదీరకపోదు గాక స
ద్వరబలధైర్యశాలులకు భాగ్యముభోగ్యముగల్గుగాక మీ
యిరవుననుండు భీష్మగురు లెప్పుడు వైరులనెంత్రుగాక త
త్తరబడుగొల్లవానిమది దల్చెదు వారికి కీడుగాదొకో॥

రాజేంద్రా యిప్పటికాసుశర్మ విరటునిపురి చేరువకరిగియుండవచ్చు మనమిచ్చోఁ గాలయాపనము జేయక తగువారిఁగూర్చుకొని యుత్తర గోగ్రహణంబునకు కదలిపోవలయుఁ గావునకొల్వుఁజాలింపుము.

దుర్యో॥ నేనీమాటలనుండఁదఁడి చే ముందు కార్యాలోచనమరచితి నికగొల్వు జాలించెదను (అనిలేచి) భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణాదియోధులారా. మీరుస్యందనారూఢులై శస్త్రాస్త్రపాణులై సంగరోన్ముఖులై వెడలిరండు

భీష్మాదులు:—మేముయుద్ధసన్నద్ధులమై ముందునడచెదము.

(అందఱునిష్క్రమించిరి)

(సుశర్మ. సత్యసేనుడు విక్రమసేనుడు సేవకుడు ప్రవేశము.)

సుశర్మ॥ శేవకా! విరటునిగోగణం బేమూలనుండునో.
శేవ॥ చిత్రము చూచివచ్చెదను. (అని నిష్క్రమించును. మరల ప్రవేశించి)
శేవ॥ విరటుని గోధనం బావనంబున కీశాన్యమూలగా గనుపించు వతి
పుళ్ళలోనున్నది.
సుశర్మ॥ సత్య సేనా!
తే॥ విరటుతమ్ముల మువ్వుర । నవ్విరటుఁగూడ
నేను బెబ్బులి లేళ్ళపై । నేగిజంపు
రీతి విక్రమలీలఁబ్ర । ఖ్యాతి మెఱయ
రణములో ఖడ్గమునకున । ర్పణము చేతు॥
విక్రమ॥ తే॥ ఓత్రిగర్తాధిపతి నాని । శాతబాణ
వర్షమున నవ్విరాటుని । వరకుమార
వర్గమును బట్టి బోరి నేను । వాఁడునమర
వర్గమడ్డము వచ్చిన । వగలఁజాల॥
సుశర్మ॥ సత్య సేనా! నీవు శేవకుని వెంటగొనిపోయి గోపకుల నెల్లరఁ బట్టి
కొట్టి గోవులబట్టుము. విక్రమ సేనా! నీవు దగు సేనలఁగూర్చుకొ
ని ముందునడువుము, నేనును వెనువెంటవచ్చెద.
సత్య॥ (విక్రమ సేనుడు) అలాగే పోవుచున్నారము.

అందఱు నిష్క్రమించిరి.

ప్రథమాంకము సంపూర్ణము.

ద్వితీయాంకము ప్రారంభము.

విరటుడు, కంకభట్టు, శేవకుడు ప్రవేశము.

విరటు॥ కంకభట్టా! గోపాలుని యొకనిఁ గోవుల సవత్సయుతముగా నేఁడు
దెమ్మని బంప నతఁడు రాలేదు, కారణం బేమో తెలియదు.
కంక॥ (యోచించి) రాజేంద్రా! ప్రొద్దుపోవుచున్నది. గోవులఁ దో
లితెచ్చెదనని పోయినగోపాలుఁడు రాకుండుటఁజూడ విరోధులచే
వానికేమో హానిసంభవించియుండునని తోఁచును.

(అంత విరటుడు యోచించుచున్నాడు) (సేవకుడుదిశలఁజూచి)

సేవ॥ భూపాలగోపాలుఁడు రోజుచు తొందరగా దేవరవారి సన్నిధికి వచ్చుచున్నాడు.

విరటు॥ ఆహా! ఏమియీవిచిత్రము నిజముగా నీకంకుభట్టు చెప్పినంతయే జరిగినది.

(గోపాలుఁడు రోజుచు) రాజా! నమస్కారము నాశరీరము కంప మెత్తుచున్నది నోటమాటరాకున్నది.

విరటు॥ ఓరిగోపాలా భయపడకు శాంతిబొందుము, నీవెక్కడినుండివచ్చుచున్నావు.

గోపా॥ నేనా వృక్షముజేవతబారినుండి తప్పించుకొని,

విరటు॥ ఏమిరా! దేహము తెలియుసి మాటలాడెదవు, గోవులఁదోలుకొనివచ్చితివా?

గోపా॥ గోవులా, గోవులా, మనకెక్కడివి గోవులు (అని నిట్టూర్పు విడుచును.)

విరటు॥ గోపాలకా నీకేమి యుపద్రవము వచ్చినది, కొంచెము శాంతించుకొని చెప్పుము.

గోపా॥ మనగోధనంబు బట్టుటకు తగుపరివారముతో సుశర్మవచ్చినాడు.

విరటు॥ (ఆశ్చర్యంబుతో) ఏసుశర్మ.

గోపా॥ ఏసుశర్మా, ఎఱుఁగరాయేమి, ఆసుశర్మే, దుర్యోధనునిప్రేరేపణవల్ల ఊరికిదక్షిణదిక్కునకువచ్చి ఆదిశఁగలపశుధనంబుఁ జూరబట్టినాడు

విరటు॥ శా॥ ఎట్టెట్టాముసునన్నెఱుంగఁజెత్రిగ । త్రైగుండుగర్వాంధుఁడై
పట్టంబాకడనున్న గోవులను జే । కట్టఁగదాఁజూ చెబర ॥
కట్టిపంచుఁదలంచియున్నదన ౯ । జింగర్ఘభగంబుని ।
కట్టంబోవగ నెట్టియే మొగముతో । వచ్చెఁ జామీకర్మము ॥

అతిగిరల నాపవిత్రాపాగ్ని యందు బూర్ణాహుతిగాఁజే యుకార్యము నేటికి జేకూడినది (అని సేవకునిజూచి) సేవకా తమతమపరివారంబులతో

యుద్ధప్రయత్నులై యుండుమని మనదండనాయకులకుఁ జెప్పి శస్త్రాస్త్రస
మేతంబుగా నాయ రథంబు దోడ్కొని రమ్మని సారథికి నియమింపుము.

శేవ॥ అయ్యా చిత్తము. (నిష్క్రమించి కొంతసేపటికి మ
రల ప్రవేశించి)

శేవ॥ భూపాలా మనవీరసేనుఁడు సత్వరంబుగా నాలగాపరులఁ దోడ్కొ
ని తమసమ్ముఖమునకు వచ్చుచున్నాడు.

విరటు॥ తే॥ శేవకా యైనులకువీర - సేనుఁడోడి
వచ్చెఁగాభయపడిగోప - బాలకులను
దోడ్కొనిపోయియుపగతులఁ - దుర్లడంచ
కిప్పురమునకుఁజొచ్చెనాశౌర్య - హీనుఁడగుచు॥

ఏడీవీరసేనుఁడు, ఏదిశనుండి వచ్చుచుండెను.

(వీరసేనుఁడు గోపాలకులు ప్రవేశము)

వీర॥ రాజేంద్రా నమస్కారము.

విరటు॥ శుభంగుగాక, వీరసేనా పార్యత్తబలుఁడణఁగినవెంటనే యెం
త విపరీతము సంఘటిలెనో వింటివా.

వీర॥ కం॥ మనుజేంద్రకర్ణపుటముల
వినుటయోగాదింకఁగనుల- విస్పష్టముగాఁ
గనివచ్చితిమాటలతోఁ
ఘణమూలస్యంబుసేయఁగాఁ- దగదింకన్.

అనుశర్మఁ డమితబలవిక్రమోపేతులగు సైన్యముతోఁజనుదెంచి దక్షిణం
బునంగల గోవులఁబట్టనది జూచి యీగోపాలకులడ్డ పడనెట్లు సెలగోల
ల వీపులువ్రయ్య లగునట్లుగొట్టెనో జూడండి

విరటు॥ (చూచి) ఆహా వాఁడెంత మూర్ఖుఁడు కానిమ్ము పిమ్మటజరిగినదేమి

వీర॥ ఏమియున్నది ఈగోపాలకులఁబట్టికొట్టి పచ్చిపుదొంగ రీతినాల్మంద
నలఁదోలుకొని పోవుచున్నాడు. నేనదికన్నులారాఁ గాంచి మనసే
నలయుద్ధసన్నద్ధులై యుండ నిశ్చయించి శత్రుసంహారమునకు గా

పిలిచి వారసన్నిధి కేవార్త విన్నవింప వీరలం దోడ్కొని వచ్చితిని.

విరటు॥ (గోపాలకులంజూచి)

కం॥ గోపాలురార మీరాపరి
తాపంబులు మానిచింతఁ - దగులకుఁడింకన్
రూపార ద్రునా సుశర్మను ।
దూపులచేనతనిబలములఁ - ద్రుక్కడఁగింతున్ ।

మీరు ణుమాత్రమైనను చింతిలవలదు వీరసేనా మనసైన్యమెల్ల సంగరోన్ముఖులై యుండిరా.

వీర॥ కం॥ మనసైనికులు త్రిగర్త
శునినామము వినఁగ సమర - శూరత వెలయన్
గనుపట్టి పిండ్లికరగెడి
మనుజులవలె బయనమైరి - మతులింపారన్ ।

విరటు॥ వీరసేనా ! మనయోధులలో నెవ్వరెవ్వరు పయనమై వచ్చుచుండిరి.

వీర- తే॥ లోకముల్వొగడఁగ శతానీకుఁడమిత
బాహుఁడు మదిరాస్యుఁడతిధైర్యవరుఁడుసాహ
సుండునా సూర్యదత్తాహ్వ యుండుసమర
లీలఁదగుసాధనములతో లేచినారు ।

మీయగ్రనందనుండగు శంఖుండాదిగాఁగల యోధాగ్రేసరులెల్లరు వైరినుదాపహా విక్రమోల్లసితులై, పగవారిబలమునుబట్టి పరాభవించుటె ప్రధానంబను చింతతో ప్రాణములమీద నాసమాని యుద్ధసన్నద్ధులై రాజవీధి నిల్చియున్నారు దొరవారి సారథియును శస్త్రాస్త్రసమేతంబుగా సరదంబు నలంకరించుకొనివచ్చి తమరాక కెదురుజూచుచున్నారు.

విరటు॥ అటులైన మేము మావెంటనే బయలుదేరెదము, సైన్యమును ముందునడచునట్లాజ్ఞాపింపుము.

వీర॥ చిత్తము, (వీరసేనుఁడు నిష్క్రమించును)

కంకు॥ (తనలో) ఈసమయమందు నాకును సంగరోత్సాహము గల్గుచు
న్నది. ఏదోనొకయుక్తిఁబన్ని వీరివెంటఁబోవయత్నించెదను. (ప్రకాశ
ముగా) రాజేంద్రా.

ఆ॥ వె॥ అస్త్రవిద్యలెల్ల-నభ్యసించితి సర్వ
యోగమంత్రకముగ-నుర్వ్యమాని
చేతవిట్టివాఁడ-నీతజేనింటిలో
యునికితెగదురధము-బనుపునాకు ।

మీరును మీబంధువులును యుద్ధమునకరుగ నేనింటికడయుండుట
ఉగదు. నాకునుతగినరథంబొకటి తెప్పించుము.

విరటు॥ తే॥గీ॥ ధాకుణీశులకనిసేయఁ-దగునుగాని
సత్యవాదులుపుణ్యులు-శాంతచిత్తు
లాగమజ్ఞులుభూరిద-యాపరులగు
ధన్యులగుబ్రాహ్మణులకిది-దగునెబూన ।

కంకు॥ తే॥గీ॥ పరశురాముఁడుమున్నుసం-గరమునందు
నిరుపవోకమూరుధరఁగల-నృపులనెల్లఁ
బట్టిపడగొట్టిరక్తప్ర-వాహములుగఁ
జేసినాడనవినవెసు-స్థిరతమీర ।

ఆజామదగ్న్యబ్రాహ్మణోత్తముఁడుగాఁడా? ఐనను బలపరాక్రమములఁబ
ట్టి యాతనిక్షత్రియోత్తముఁడనుటకు సందేహమా! నేను యుద్ధమం
దంతగా నిపుణుఁడనుగాను, కాకున్నను ఈపురిలో నన్నుమించినమేటి
మగలింకా మువ్వురుండిరి వారిని వక్కాణించిచెప్పెద.

విరటు॥ శలవొసంగుము.

కంకు॥ తే॥ వలలుఁడసమానభుజబల-కలిమిగల్గు
మంచిమగఁడుదామగ్రంథి-నెంచలేరు
పరిభవమందునవైరు-లపాలయముని
సముఁడువినుముతంత్రీపాలుఁ-డమితబలుఁడు ।

మున్న వీరిమువ్వురిబలపరాక్రమంబులు కొంతవరకే నెఱింగినవాఁడ నిప్పుడు వారారోహణంబుసేయఁ దగినరథంబులంపి సంగరంబునకు బోద్రోసిపోవ మేలుచేకూఱుఁగావున నానతిమ్ము యట్లుసేయుదును.

విరటు॥ ఆలాగే సేయనొడంబడితి (అని బ్రాహ్మణునిదెసఁజూచి) బ్రాహ్మణోత్తమా! సింహబలాదుల యుత్తరక్రియలకీదినమున జరుపవలసినదాని నంతటను నుత్తరునిచేవలయు పదార్థంబులెల్ల దెప్పించి జరిగించుము.

బ్రా॥ ఆలాగే జరిగించెద.

విరటు॥ మేమిక సంగరమున కరుగుదుము.

బ్రా॥ మీకు శుభమగుగాక, త్వరితగతి విజయము చేయుఁడి.

(విరటుడు తమ్మునిజూచి) శతానీకా! యాకంకవలల దామగ్రంధితంత్రీపాలులకు నాల్గురథంబుల నాయుధసమేతంబుగా త్వరితగతి దెప్పించుము.

శతా॥ భవదాజ్ఞాబద్ధుఁడ. (నిష్క్రమించును)

విర॥ సీ॥ శేవకానీవతశీఘ్రంబుగానింక । వరసుకుమారుఁడుత్తరకుమారుఁ
గనుగొనిపురికిదక్షిణమునఁగలమన । గోధనంబునుబట్టిగోపకులను
గొట్టిగోవులఁజూరగొనిపోయెడిత్రిగర్త । పతిసుశర్మనుగొట్టిపశుధనంబుఁ
బురిఁజేర్చువరకునీపురముసంరక్షణ । మతిజాగ్రతగఁజేయుమనుచు నేను

తే॥ చెప్పితినటంచునతనికి జెప్పివేగ
కంకువలలాంకుదురగశిక్షకునిగోప
కులవరోత్తంసకునితోడ గలసిమమ్ము
గలయువెనువెంటరమ్ము చక్కంగఁబొమ్ము ।

శేవ॥ చిత్తము పోయిచెప్పి వచ్చెద, (అనునిష్క్రమించును)

(కంకవలల దామగ్రంధి తంత్రీపాలురు ప్రవేశము)

కంకు॥ వలలుఁడా మనమీపల్లమందు గూర్చుండి విరటునకెద్దియైన నవా

యము పోసగనేని, వెంటనే పరుగిడిపోయి ప్రతిపక్షబలంబును జరి మార్పవలయును గావుననీవు బాగుగాఁ జూచుచుండుసుమీ.

వల॥ చిత్తము. (సుశర్మ రణభేరి వేయించుట)

వలలు॥ ఈయుద్ధభేరీ భాంకారముచే నాశరీరము పులకరించుచున్నది. ఏదీ నాగదాయుధము. (అని లేవ యత్నించును)

కంకు॥ వలలుఁడా కూర్చుండుము. ఇదిసమయముగాదు, నీవేసంగ్రామ భీముండనను కొంటివా. నీవెవ్వండవో జ్ఞప్తికిదెచ్చుకో.

వల॥ నేనా, (యోచించి) విరటుని వంటలవాఁడను, వీరావేశముచే నా సంగతిని మరచితి, నితప్పుక్షమించండి, (అనికూర్చుండును)

వల॥ ఏమీ, యీసంగ్రామమునకు దాడికాయవలె రాలుచున్న శిరంబులన్నియు మనవిరోధుల వేయగునా.

కంకు॥ తథాస్తు (భేరీ మ్రోగును)

వల॥ ఉలికిపడి.

తే॥ వైరియోధులలోనసనవక్రవిక్ర॥
మాఢ్యులగువారుతమసైన్య మణఁగఁగాంచి॥
వీరసేనునినానాస్త్ర ధారిమునుపు॥
నతఁడుమరలరథంబెక్కి నతిరయముగ॥

మనవీరసేనునిపైకి పోక్కుచున్నాఁడు శత్రుసేనాధిపతి యుగ్రవిక్రమసేనుఁడు వెం దలుగాఁగల వారిలడ్డఁ డిస్సుగ నెట్టుచున్నది జేసుపీరసేనునకి సహా యముగాఁబోయెద. (అసి లేవ యత్నించును)

కంకు॥ తాళు తాళు కంగారుపడకు సన్నునీవు మరచుచుంటివేమి, తొం దరించకు.

వల॥ అవునవును (అనికూర్చుండును). (భేరీ మ్రోయుట)

వల॥ (దేరిపారఁజూచి)

తే॥ అత్రిగోత్రోద్భవుండు మత్స్యావనీశుఁ॥
డాఁకియు త్సాహమొప్పంగ ధ్వజముర థము॥

సత్వములనేలఁగూల్చి సత్యార్తిఁ గోడ।
విరటునకుఁదోడుబడనిదే వేళసుమ్ము॥
[అనిలేవ గమకించును]
కంకు॥ బాపు బాపు, కొంచెమునిదానించు, ఇప్పుడేమి జరుగుచున్నదో.
వల॥ [పారజూచి]
మ॥ మనమత్స్యేశ్వరుండి పుస్యందనముపై మధ్యందినాదిత్యభా।
తినిజూడంగనుపట్టి కేలగదను ద్దీపింపఁగాబట్టిగ్రి॥
త్తునవైరింగదియంగదుంకిజడియం గొట్టెరథాశ్వాళినిం।
పౌనరంగంగరముందుబాహుబలద ర్పోత్సాహసంరంభుఁడై॥
కంకు॥ తర్వాత
వల॥ [చూచి] ఆ! ఆ! అసుశర్మవిరథుఁ డై భూమియందుఁ వగా।
దుమికిగదను కేల నమరిచికొని।
విరటువిరావఁగదియు వేళకుమదిరాను॥
నాదిసోదరులు సహాయులైరి॥
కంకు॥ అటుపిమ్మట
వల॥ (చూచి)
తే॥ అంతలోనఁద్రిగ ర్తభూ- కాంతునకును
యోధగులతిసంగరో- ద్యోగి మెప్పఁ
దోడుపడనొండొరులుద్రై ర్య- ధుర్యులగుచుఁ
గదియరాసంకులంబయ్యె- గంక భట్ట॥
మనరాజుగారు సుశర్మ చేసినుగులవంటి యడిదపుదెబ్బలుతిని మూర్ఛ బోయినట్లుగన్పట్టుచున్నాడు నేనిప్పుడుబోయిరాజుగారికిసహాయపడి యెద
కంకు॥ బాపు బాపు నేనొక్కసంగతిఁదెల్పెద నదిమొద్దియన పాండవులిం దుదాగియుండిరను సంశయంబుచే ధృతరాష్ట్రునియనుమతిఁబడసి వారిగ నుగొనుతలంపుగల్గి గోగ్రహణనెపంబున నిత్రిగర్తేశ్వరునింనుబంపియుం దునేమో యనినాయూహయూహాబోధమునది.

దామ॥ వానికట్టిదుద్దేశ్యముగల్గుటొకలెక్కగాదు

కంకు॥ ఇదియటుండ నాదుర్యోధనుడుకూడా మిగిలినయోధులఁ గూర్చుకొనిమనలఁగనుగొనవలయునని రేపువచ్చునేమో

తంత్రీ॥ అవును మనరాజుగారికి మనమందఱమిచ్చటనుండ గొంతయైన భయముగల్గదు కొంతదనుక నింకానేమేమిజరుగునో చూచుచుండరాదా యింతలో మిగిలినదేమిటి.

వల॥ (కోపముతో) చూచిచూచి కన్నులొట్టబోయెను అదుగో మన విరటునిబట్టి పెడకేలఁగట్టిపట్టుకొనిపోవుచున్నారు పసిమిగిలినపిమ్మట మన బలమేమిచేయును పాడుచేయనా.

దామ॥ (చూచి) విరోధులకు చిక్కఁబడెఁగదా విరటుఁడు వలలా యిదేమంచిసమయము

కంకు॥ (చూచి) తే॥ మనముమత్స్యేశ్వరునినాశ్ర- మంబునందు
బ్రతికిజీవముతోనున్న- వారమతని
నుగ్రవైరులపాల్పడ- కుండఁజేయు
సమయమిదిగానముప్పురు- జనుడి వేగ॥

మీరవిరటుని విడిపించిరందు మీకుశుభంబగుఁగాక.

వల॥ (చిరునవ్వుతో)

చం॥ విరటునికట్లనూడ్చెదవి- వేకముతోబసులన్మరల్చెదన్
గరకరినాత్రిగర్తపతిఁ- గావరముందొరగంగఁదన్నెదన్
స్థిరముగఁగాల్బలంబులన- శేషముగాఁబొరిగొందుసమ్మదన్
బొరయఁగనిందువిల్వడుబ్ర- యోజనమేమిటి వీరితోనిటన్॥

కంకు॥ వలలానీవుతరువుబెఱికికొని యురువడిగాఁబోతివేని వైరిబలంబునిన్నుగాంచి వృకోదరుండని తెలిసికొందురు వెంటనేమనకు మోసము సంభవించును గావున నీకవలలఁ జక్రరక్షకులుగాఁ జేసికొని శరశరాసనాద్యాయుధవ్యాపారంబుతో విరోధులఁ దునుమాడి విరటుని విడిపించుకొనిరమ్ము.

వల॥ అంతవలలుఁడు రణరంగంబుం గాంచి ఆశ్చర్యంబుతో

ఉ॥ మిక్కిలిచిత్రమయ్యెనని - మేషముక్రిందట రక్తవార్ధి బెం
పెక్కుడు ధూళిఁ గ్రుంగియుమ - జే మొకొ యిట్టులఁ దోచెనియ్యెడన్
దక్కకఁ జూడ నాదివస - నాథుఁడు పశ్చిమదిక్కు గ్రుంకని
ల్లెక్కుడు సాంధ్యరాగతతు లెల్లెడ గ్రమ్మె ననొక్క పెట్టునన్

దామగ్రంధీ తంత్రిపాలా మనవిరటుని చెరబట్టి నత్రిగర్తనాథుని బట్టి క
ట్టితిరుగ విరోధిని విరటునికి స్వాధీనపరచి వత్తమురండి

(అందఱునిష్క్రమింతురు)

(సుశర్మ సత్యసేనుఁడు విక్రమసేనుఁడు శేవకుఁడు ప్రవేశము)

సుశర్మ॥ తే॥ అమితబలవిక్రమోపేతుఁ - డైనమత్స్య
నాయకుని బట్టికట్టిర - ణంబునందు
నిగ్రహించియు భగవద - నుగ్రహమున
విజయమందినవార మో - విక్రమాఢ్య॥

స్వామికార్యంబుకై మానంబు నపేక్షించి ప్రాణంబులపై నాసమానిపో
రాడిన మాకుతగిన సన్మానములు రేపు జేయువాఁడను, ఇక నీమత్స్యేశ్వరుని
గుఱించి ముందు సేయఁదగిన కార్యమెద్దియో మీరెల్లరు యోచన జేయుఁడు

సత్య॥ రాజేంద్రా, భండనంబున కండకొవ్వుచే గండుమీరిన యీ మత్స్య
భూమండలాధిపుని దండధరు మందిరంబున గాపురంబుండ బంపుటదక్క
నింకేమి యోచనగలదు

విక్ర॥ కం॥ ఆయుధహీనులు మృతులను ॥
చాంయూర్యులు దెలుపుచుందు - రదిమిథ్యగమీ॥
రీయెడఁ జేయఁగఁ జెల్లదు ॥
న్యాయము మించంగ రాజ - నరులకు దగునే ॥

విరోధి చేజిక్కినప్పుడు ఉభయలోకము మెచ్చునట్లు సన్మానము జేయుట
యే మంచిది.

సుశర్మ॥ కం॥ ఈవిరటుఁడుతోలిసనుపీ
రావేశముచేజయించి- యవమానించెఁ
గావుననీసమయంబున
దైవికముగఁజిక్కె-వదల- దలచుటదగునే

విక్రమసేనా, నీమాటచొప్పున నేనిప్పగతుని విడిచితి నేని నాపగదీర్చు కొనుట కవకాశము గల్గనేరదు. (అనిసేవకునిజూచి)

తే॥ శేవకాసత్వరగఁబోయి- యావిరాటుఁ
బట్టుకొనియిప్డు పెడకేలు- గట్టిచుచటి
కీడ్చుకొనిరమ్ము పశువుల- నెల్లమనపు
రమ్ముమార్గముఁబట్టించి- రమ్ము పొమ్ము

శేవ॥ చిత్తము. (అంతశేవకుడు మెల్లగాబోవుచున్నాడు)

విక్ర॥ తే॥ వేగబడనేలనామొఱ- వినఁగదయ్య
దైవవశమునవైరులఁ- దగిలిగొట్టి
నారమనిఘోరమొగిసేయ- న్యాయమగునె
కీర్తికరమగునదియె- త్రిగర్తనాధ

సుశర్మ॥ నాకుగీర్తితో బనియేమిప గతుడుఁపట్టుపడినపుడు కరుణచేతిరుగ విడిచితిమేని! తుదకు ప్రాణాంతముకూడ రావచ్చు నీవునామాట కడ్డు చెప్పవలదు.

విక్ర॥ తే॥ ఇట్టియెడశత్రువువీడు- టేయుదార
చిత్తులగువీరవర్యుల- కుత్తమంబు
గానకారుణ్యమునకిజ్జ- గానపాటి
లేదునామాటవినుమింక- మీఁదఁదేవ

(శేవకుడు విరటునుప్రవేశము)

(సుశర్మనిలచి హేళనగా) ఓహోఘరట మహారాజులవారా, విజయముచేయండి ఎంతకాలమునకు దర్శనము, దొరవారెప్పుడును పగవారికిపట్టుబడువారు కారుకాబోలు

విరటు॥ నీవలె పరులగోవుల దొంగిలవచ్చిన దొంగనుగాను నాదేశమును నాగోవ్రిజంబును గాపాడుకొనవచ్చిన మహారాజను నేనుదొరను గాక నీవలె దొంగనగుదునా.

సుశర్మ॥ నాచేతనీకు చావుమూడినది.

విర॥ ధనవంతుఁడు తస్కరుని బారిఁబడినపుడు చావుగాకమరేమిగలదు

సుశ॥ ఆ॥వె॥ ఓవిరాటనీకు - జీవించవలెనని
కోర్కెయుండెనేని-కొంతికొమరు
లీపురంబులోన నేడనుండిరొగాంచి
దెల్పవైతోయసురఁ- దీతుఁజూడు॥

కొంతకాలము బ్రతుకుపై నాశయుండెనేని పాండవులెడయుండిరో పట్టితెచ్చి యొప్పగించుము లేదేనివారిజాడయైన జెప్పుము అట్లుచెప్పవేని నిన్నుప్రాణములతో విడుచునదిలేదు.

విరటు॥ శహబాష్ నీకుచిక్కితిననుభయముచే నేటికసత్యమాడ నేర్చుకొమ్మంటివా॥ ఆపుణ్యపురుషులగూఢచర్య యెవ్వారికిదెలియును అట్టిమహాత్ములే యీపురంబునన్నునాకేమికొఱంత

సుశ॥ పాండవులీపట్టణంబులోలేరా

విర॥ లేరు

సుశ॥ లేరుగా

విర॥ పాండవులేమాపట్టణంబునందున్న యెడ నిన్నుప్రాణములతోవిడుతురా

సుశ॥ నాప్రాణములసంగతి నటుండనిమ్ము నీప్రాణములు నిల్చుసంగతి జూచుకో

విర॥ దుర్నీతిచేఁ బ్రాణాపేక్షగోరుట నీవంటి శౌర్యహీనులకుగాని మావంటిశౌర్యశాలులకుగాదు

సుశ॥ తొందరపడగదు శాంతించు విక్రమసేనా

ఉ॥ ఈవిరటుడు తెంపుగొని-హెచ్చుగఁబ్రేలుటవీనులార విన్నావుగదావివేకివలె- న్యాయముజెప్పగఁబూనితౌభళా

కేవలపాషంబిచట- గీడ్పడఁజేసివధించమేలగుఁ
గావునవింకమీఁదనిది- గాదనిచెప్పఁదలంచినాడవే॥

విప్ర॥ చం॥ అవనిపనీతులోఁబడిన- యట్టివిరోధిఁ జంపఁబూనుటల్
శవమును జంపునట్లితని- సాగనంపుట చావుకన్న నె
క్కువపనియట్లు సేయుటికి- క్రూరతనంబొగిఁ జేసిరేని గౌ
రవముదొఱంగుగాక సరి- రాజులుచుల్కఁగఁ జూడరేమిమున్॥

సుశర్మ॥ అటులైనసరే తెల్లవారినతరువాత విరటునిపని యాలోచింతము (అని సేవకుని జూచి) సేవకా యీరాజాధముని యిచటవదరనీక యీడ్చుకొనిపోయి తగినపాశంబులతో బంధించి యీరాత్రికి భద్రముగాఁ గాపాడుచుండుము.

సేవ॥ చిత్తము—[సేవకుఁడు విరాటుని నెట్టుకొని పోవుచున్నాఁడు]

సుశర్మ॥ చం॥ మనపనిదీరెఁ బాండునికు- మారులఁ గన్గొని స్వామికార్యముఁ
ఘనముగఁదీర్చి కీర్తినిచో- కాటముగాఁబడయింతు నాసుయో
ధనుఁడు విరాటుపట్టమున- దాగిరి పాండవులంచు దెల్పెఁగా
వునమనమింకఁ జూడము ను- ముంబడకుందరు వారలిత్తఱిన్॥

పాండవులిందే గలరని సుయోధనుని వలెనే కొల్లురాధియయ్యో నంటినే నియోచించగా విరాటుఁడు మనకు చిక్కుబడియు పాండవులదండ జూచుకొని బహుగా ప్రేలుచున్నవాఁడని దోచుచున్నది. (యోచించి) ఏమీ యీ కలకల భటులన క్షోభధ్వనులు వినబడుచున్నవి.

[తెరలోఁ కలకల]

భటులు ॥ తే॥ ఎవ్వరో వీరవర్యులు- మువ్వురుమన
వీరయోధులపైఁబడి- విడిదిచెడఁగ
నస్త్రసహస్రలచేవారి- కడ్డుపడిన
వారిదహనంబుజేయుచు- న్నారలిపుడు॥

రాజేంద్రా కావలివారమగు మమ్ము బడఁగొట్టి విరటునిపట్టుకొని బంధనము లూడ్చుచున్నారు వేగముగావచ్చి మమ్ము రక్షింపుడు

సుశర్మ॥ [చూచి బిగ్గరగా] ఓరీ విరటుని కట్లువిడిపింపవచ్చిన నీవెవ్వడవు

వలలు॥ నేనెవ్వడనైననేమి

చం॥ నిలుముసుశర్మనీబలము - నీటడఁగించితిమావిరాటు నా
బలము చెలంగబంధములఁబాపితిఁగమ్మఱఁబట్టినమ్ము బె
బ్బులిముఖమందుబడ్డపసి - బోతునుబోలినవాఁడవైతి వం
టలనుమదీయనేర్పరిత - నంబునుజూపినరీతిఁజేసెదన్॥

నీవుపౌరుషశాలివైన పోరాటమందు నన్నతిక్రమించి మానప్రాణము
లుదక్కించుకొని మఱిపొమ్ము

సుశర్మ॥ (తనలో) ఏమీ యీవిచిత్రము వాఁడెవ్వఁడోగాని నన్ను పేరెత్తి
పిలుచుచున్నాడు [ప్రకాశముగా] సత్యసేనా విక్రమసేనా మీరింకుండిరేని
నేనీతని నొక్కక్షణకాలంబులో యమసన్నిధానమునకంపివచ్చెద.

మ॥ ఇదిగోవచ్చెదనేనువచ్చువరకీ - వీలాగుఁబోరింగఁబూ ।
నెదుసంగ్రామమునన్నిమేషమెదుటన్ - నిల్వంగనావిక్రమ
ప్రథితాస్త్రోత్కరగులంగఁజేయఁజిదురై - బాటిల్లవో నేడ్కనీ
వదరుల్ మానెదవప్పుడన్నదియరా - పచ్చన్ జుమీనత్వరన్॥

విక్రమసేనా నేను సత్వరంబుగాఁబోవుచున్నాడ నాశరశరాసనాద్యా
యుధంబులిటు దెమ్ము. (అని అందుకొని తెఱలోనికిబోవును)

(తెఱలో భటులకలకల)

భటులు॥ ఉ॥ విక్రమసేనయీడకొక - పీరుఁడువచ్చితఁగన్ దిగర్తభూ
చక్రధురంధరుండగుసు - శర్మగదాయుధమెత్తిమోదిని
ర్వక్రపరాక్రమప్రకట - బాహుబలంబునఁబట్టిరాజిటన్
విక్రమహానుఁడయ్యెఁగడు - వేగమెరక్షణజేయరమ్మికన్

ఎవ్వరోమువ్వురు వీరపురుషులిందువచ్చి యందొక్కఁడు విరటునిగా
నిపోవుచుండె నింకొక్కఁడుగదా యుధంబు చేమనభూపతిని సత్యసేనుని
మూర్ఛబుచ్చిపోయె మఱియొకఁడు విరాటునికట్లువిడిపించె అయ్యోవిరా
టుఁడు తప్పించుకబోయెనిక నేమిసేయుదుము విక్రమసేనా నీవింకతో

రగారమ్ము.

విక్రి॥ ఓరిభటా ఎవ్వఁడోయొకమహాబలశాలివచ్చి మనరాజేంద్రుని య
తనితమ్మునిమూర్ఛబోగొట్టి విరటునివోడ్కొనిపోవుచున్నాఁడట నాబాణ
బాణాసనములిటుతెమ్ము వేగముగాఁబోయివాని పొట్టకొఱిళ్ళ మట్టుబె
ట్టివచ్చెద.

సేవ॥ ఇదిగో తెచ్చితిని (అనిబాణములీయగా అందుకొనిపోవుచున్నాఁడు)

విక్రి॥ మ॥ ఇదిగోవచ్చుచునుంటిమానృపతినీ- వీపట్టునన్వీడకు
న్నదయంబూనకఁ జేతిఖడ్గమున మే- నంబాణములార్పిమ
త్స్వధరావల్లభుఁబట్టికట్టిదఁ దిగ- ర్తాధ్యక్షునిం దోడితె
చ్చెదమీగోధనమెల్లఁజూరఁగొనెదం- స్వేచ్ఛన్ననుంజూడుమీ

నరవరాధమా మాసుశర్మ మహారాజును విడువలేముగా నీవుసామం
బుగా విడుచునట్లులేదు.

వల॥ ఓరినీవుదూరంబుగా నిల్చిపేరెలెగవేల ననుదారసించిన తరువాత ని
న్ను దండధరుని సన్నిధానంబున కంపుటకీగదాయుధంబు తొందరించుచు
న్నది.నాతోబోరాటమ్మునకు రమ్ము.

[తెరలో]

భటులు॥ అక్కటా వీడెవ్వడోయమునివలె మండిపడుచువచ్చి మనయో
ధవీరుల నెల్లరజంపుటయగాక విక్రమసేనుని శిరోభిన్నముజేసె సేనలెల్ల
బాయలు పాయలుగా విచ్చిపోవుచున్నవి హా సేనాపతి నీవునమ్ము విడిచి
పోతివిగదా యికమాకెవ్వరుదిక్కు. (అనిపారిపోవుచున్నారు)

వల॥ ఉ॥ సంగరమందునిల్చిఘన- శౌర్యము వైరులమీదఁజూపకన్
భంగముబొందిసిగ్గువిడి- పాఱెదరేలఁ ద్రిగర్తనాథునిన్
సంగతినిల్పిగాంచికడు- సాహసులై విడిపింపలేరిమీ
సింగిణుతేల నస్త్రములం- జేతులఁబూనగనేలఁ జెట్టలై

దాము॥ ఉ॥ పాయలుపాయలైయుటులఁ పౌరుషులైకడుభీరులై వెసన్
బోయదరేలనెక్కడికిఁ బోయదరీరణభూమిబాసిఁ ఛీ

పోయినయంతమాత్రమునఁ బోవునె మృత్యువు కూడ మీరు వలెఁ
బాయక బోరినన్ గెలువ వచ్చును సంశయ మేలరండికన్ ॥

తంత్రీ॥ చం॥ పసరము లెల్ల నీగతిని బస్వాలం బెట్టుచుఁ బోవుగానిఁయి
వ్వసుమతి మానవోత్తములు వార్యతశౌర్యము మానిభీరులై
పసగలసంగరంబు విడి ప్రాణముపై భ్రమగల్గి పాఱఁబో
వుసుడి యశంబు లంగిలియు బొందికిగా నిటు సేయఁబాడి నే

మీరు వీరభటులైన యవమానంబునకోర్చి చావునకు జడిసి పాఱిపో
య్యెదరా మీకరంబులం గల వికత్తులయ్యో నేని కదనంబునకు దిరుగరండి
తెడ్లయ్యో నేని సంశయింపక పాఱిపొండి

సుశ॥ (మూర్ఛ దేరి తనలో) హా దైవమా మత్స్యరాధుని సేనాసముద్ర
మును గడచి వంటలవాఁడను బిల్ల కాలువకు జిక్కినట్లు జేసితివిగదా నిన్ను
నమ్ముకొన్నవానికన్నము దొరికునా ॥ప్ర॥ నన్ను బట్టికట్టినవాఁడెవ్వడు

వల॥ విరటుని వంటలవాఁడనగు నేనే గట్టివేసితి బలమున్నచో ద్రెంచుకొ
నిపొమ్ము. (అనివిరటుని దెసఁజూచి)

తే॥ గీ॥ ఓవిరాటమహేశ్వర యుగ్రరిపులఁ
గెల్చితివి మీరు సేనతో గృహము జేరు
డేము మనపశువుల వెంట నీద్విపాద
పశువు నచటికి బట్టుక పత్తు మయ్య॥

విర॥ అలాగే బోవయత్నించెదము.

వల॥ (సుశర్మ దెసజూచి) సుశర్మా గర్వభంగ మైనదా (అని చేయి బట్టుకొనును)

సుశ॥ దీనుండై యుద్ధజయము దైవాధీనము నేను నీ బారిఁబడితినని యింత
లోనె నధికుఁడనని ప్రజ్వీగకు ఇట్టి నడమంత్రపు సిరికింత గర్వమేల ఇల్లలికి
ముగ్గుబెట్టగ నేపండుగుగాదు. (అసిచేయిని విదళించుచున్నాడు)

వల॥ సుశర్మా నీవిట్లు పెనుగులాడితి వేని తావు జేరునప్పటికి ప్రాణవాయు
వులు తావు వదలునట్లు తెన్నుదును బుద్ధివంతుఁడవై వదరక ముందు నడవుము

(కంక వలల దామగ్రంధి తంత్రిపాల సుశర్మలు ప్రవేశము.)

తదుపరిమీాదయు.

విర॥ సుశర్మా.

సీ॥ ఈకంకుభట్టుచే - నీరాజ్యవైభవం
బెల్లనాకులభించె - నల్లమలర
వంటలవానియ - వార్యపరాక్రమ
ప్రతతిచేమాటినాకు - బ్రతుకుగల్గె
గర్వాంధుడైనన్ను - గదసినరుగతులఁ
బట్టిదామగ్రంధి - ప్రాణమిచ్చె
నేపట్టుజూడఁదంత్రీ - పాలుఁడొక్కఁడై
గనుపట్టిమానంబు - గాచెనట్టి॥

తే॥గీ॥ పుణ్యమూర్తులకీమత్స్య ♦ భూమిధనము
నస్మదీయశరీరంబు ♦ నతిముదమునఁ
సొగసమర్పించఁగాఁమది ♦ దలఁచియున్న
వాఁడనని నేఁడుఫలమేమి ♦ పదరకుండు॥

కంకు॥ రాజేంద్రా మీావిమ్మోడమమ్మొకగొప్పగాఁ బొగడఁదగదు పూ
తంబున కలిగినపిమ్మట మీాయిష్టానుసారంబుగా గౌరవింపవచ్చు.

కం॥ వినుమొక్కటి ♦ దెల్పెదనో
మనుజేశ్వరయీాత్రిగర్త ♦ మనుజేశ్వరుస్వం
దనగజతుర ♦ గాహలతో
బనివడివిడిపింపఁగాళు ♦ భంబగుమనకున్॥

సుశర్మను విడిపించిపుచ్చినపిమ్మట భవద్విజయఘోషంబిప్పుడఁబునందు చా
టనియమింపుము.

విర॥ మహాప్రసాదము (సుశర్మనుజూచి) సుశర్మా యీాకంకునిదయాపూ
రసంబుచే నిన్నువిడిపించదలంచితిమి (అనిబంధనములువిడిపించి) నీవు
మాకు శరణుజొచ్చుటచే శత్రుత్వమునకు మాకుగామిత్రుండవైతివి మీాద
నీపరాభవపరితాపము మరచినీవును నీతమ్ముఁడుమొదలగు వారెల్లరును

మాగృహంబునకువిచ్చేసి తగుగౌరవంబుబొంది పోవలయునని ప్రార్థిం
చుచున్నాడ.

సుశర్మ॥ రాజేంద్రాకదనమందు ఖడ్గంబుచేగాక నీయాదరంబుచే నాశి
రచ్ఛేదనంబిప్పుడు నిజముగాచేసినట్లయినది మానవంతునకింత కన్నమర
ణమెక్కుడనున్నది.

విర॥ సుశర్మానీవు పశ్చాత్తాపమందకుమని మిక్కిలిగాఁబ్రార్థించెద
(అనికంకునిజూచి) కంకభట్టాయీరాత్రి మనసైన్యంబునిచ్చోట నిద్రించు
నట్లునియమించి మనమునుగొంతసేపు విశ్రమింతము.

కంకు॥ రాజామీయాజ్ఞప్రకారముజేసెద.

విర॥ వలలా దామగ్రంధీ తంత్రిపాలా నాకొఱకుమీరతి శ్రమజేసితిరి
మీరుకొంచెము విశ్రమించుడు.

వల॥ మాశ్రమయొకలెక్కగాదు వచ్చినపనిముచ్చటగానెఱవేరినదియే
లినవారు విశ్రమింపవలయునని ప్రార్థించుచున్నారము.

(చారులుపురంబులోసాటించుట)

చారులు॥ ఓహోహోపౌరులారా మీరందఱువినందగు మనదొరగారి
గడచిన రేయిదుర్యోధనప్రే[illegible]నట్లు వచ్చిగోవులఁబూరబుచ్చినత్రిగర్త
శ్వరుండగు సుశర్మనుబట్టికట్టి అఱగొరగా మానప్రాణంబులుదీసిరోహోహో

దక్షిణగోగ్రహణము-సంపూర్ణము.

ద్వితీయాంకము-ముగిసెను.



## ఉత్తరగోగ్రహణము - ప్రారంభము.

(దుర్యోధనసుశర్మాదియోధులు ప్రవేశించుచున్నారు)

దుర్యో॥ చారులారా విరాటునిపశుగణంబే దెసనెందుగలవో మాచిరండు

చారు॥ చిత్తముపోవుచున్నాము.

(నిష్క్రమించుచున్నారు)

దుర్యో॥ యోధాగ్రేసరులారా

శేష్యాదులు॥ ఏమిరాజకులాగ్రగణ్యా.

దుర్యో॥

తే॥ మత్స్యభూనాథునాసుశ ♦ ర్మక్షితీశ్వ
రుండునిన్నటిరోజునా ♦ రూఢమతిని
బట్టిగోవులతోగజ ♦ పట్టణంబు
మార్గమునుబట్టవచ్చని ♦ రగ్గళముగ॥

మీరీదెసఁగలయంబరికించి గోపాలకులఁగొట్టి గోవులఁబట్టినయెడపాండవులసంగతి దెలియకపోదు.

కర్ణాదులు॥ అలాగే సేయబూనెదము.

(చతురుఁడనుగోపాలుఁడు ప్రవేశము)

కర్ణ॥ నీవెవ్వఁడవు.

చతు॥ నేనా చతురుఁడను నామాంకముగలగోపాలకుఁడను.

కర్ణ॥ చతురుడా ఈమత్స్యదేశమునపశుసమృద్ధిగలదా.

చతు॥ పశుసమృద్ధితోబనియేమి.

కర్ణ॥ మాకుకొన్ని కావలసియున్నవి క్రయమునకుఁబుచ్చుకొందుము.

చతు॥ పశుసమృద్ధి బాగానేయున్నదిగాని యిచ్చోవిక్రయించునవి లేవు.

కర్ణ॥ పోనిమ్ము పశువులెచ్చటనున్నవి.

చతు॥ పశువులా ఏవి ద్విపాదపశువులిచ్చోటనే సమృద్ధిగానున్నవి.

కర్ణ॥ (తనలో) పశుధనంబెచ్చటనున్నదియన. కసివోవునట్లువిరోధాభాసముగా మాట్లాడుచున్నాడు. ఏమి. యీవింత (ప్రకాశముగా) ఓరి

నీకుపశుధనంబెక్కడా ప్రాణములెక్కడా.

చతు॥ నాకాపశుధనంబు కన్న నిముషములోనూరేగు ప్రాణములెక్కు వయని యెవ్వరినుకోనెదరు నీకువలసియుండనేని యీప్రాణవాయువుల భక్షణజేయుము.

కర్ణ॥ ఓరిశెలిపిహీనుడా నామాటవినుము నీవీపశువులసంగతిజెప్పకున్న ను మేమువిరాటునిగోవులం బట్టుకుండము మాచారులు పశువులసంగతినే గనుంగొనబోయిరి వారలూరకవచ్చువారుగారు.

చతు॥ సరిసరి వారలూరకరాకున్న నేమివచ్చినసేమి వీరాకీదుర్బుద్ధియూర కగల్గినదా ప్రాణములుచేదయి చెడిపోవుటకేగల్గినదిగాని.

కర్ణ॥ మాప్రాణములసంగతినట్లుండనీ నీప్రాణములనిల్పకొనంగోరితి వేని మాచారులువచ్చులోగా బుద్ధిమంతుండవై నిజముజెప్పుము తగినస న్మానముజేయుదుము.

చతు॥ (నవ్వుచు) నీసన్మానమెంతనీవెంత మాకుమీసన్మానములోబ నిలేదు ఈవ్యర్థప్రయత్నముమానివచ్చినదారినేతిరిగియుండ్లకుపొండి కాదేని

ఆ॥ ప్రళయకాలవహ్ని * పగిదిమీసైన్యకా
ననముసాయకార్చు * లనువిదిట్టి
తగులబెట్టిఘోర * తరశరపఙ్క్తిచే
నుక్కడంచుమిమ్ము * నుత్తరుండు॥

కొంతవడికిట్లావదరుచుంటిరేని మాయుత్తరకుమారుండువచ్చి మీమాన ప్రాణంబుల దాహముబుచ్చుకొనకమానడు.

కర్ణ॥ (కోపముతో) ద్రోహీ నోటికివచ్చినట్లుప్రేలెదవేమి యిప్పుడేనీ త్రుళ్లడంచెదము (అనిభటులజూచి) భటులారా యీదురాగ్రహుని శిక్షించుడు.

భటు॥ ఓరీమాయంగరాజునుతిరస్కరించినఫలమనుభవించుము.

(అనికొట్టుచున్నారు)

చతు॥ అనుభవింపకతీరదు క్షణమాగితేని దీనికిపదిరెట్లెక్కవగా మా

ప్రభువుగారిచేత మీరెల్లరుతగినంతగా ననుభవింతురుగాక.

భటు॥ మేమేలఅనుభవించెదము. (అనిమసికొట్టుచు)

కర్ణు॥ ఓరీయిక్కనైననిజముజెప్పెదవా.

చతు॥ నిజముచెప్పనబద్ధమెట్టిదోమా దేశమందేచూడము.

కర్ణు॥ నీవుమాతోదర్కములాడుట నిష్కారణముగాఁ చెట్టుకొట్టిపై నివేసికొన్నట్లున్నది.

చతు॥ చాలుచాలుమీపాండిత్యమునకు నేనుమెచ్చుకొంటిని.

కర్ణు॥ నవ్వుమ యోధులారా వీనితోవృథాప్రసంగముచేఁ గాలయాపనము జేయఁదగదు వీనినట్లుదూరముగాఁ దఱిమివేయుడు

భటులు॥ చిత్తము. (అనిచతురునితఱిమిగొట్టుచున్నారు)

(చారులుప్రవేశము)

చారు॥ రాజేంద్రానమస్కారము విరటునిగోబృందంబావనముదరిగాఁ గనుమేరదూరములోనున్నది.

దుర్యో॥ భీష్మద్రోణకృపాశ్వత్థామ కర్ణవికర్ణదుశ్శాసనాది యోధులారా మీరలిత్వరితగతిఁజని విరటునిగోవులఁబట్టి గోపాలకులఁగొట్టిరండు.

భీష్మాదియోధులు॥ ఆలాగేమేముపోయివచ్చెదము.

[నిష్క్రమించుచున్నారు]

(ఉత్తరునిసభామంటపము గోపాలకులుప్రవేశము)

గోపా॥ ఉత్తరకుమారా దండములు దండములు.

ఉత్తరుడు॥ గోపాలానీవెచ్చటనుండివచ్చితివి

గోపా॥ ఉత్తరదిశనుండి.

ఉత్తరుడు॥ ఇంతతొందరగావచ్చినకారణంబెయ్యది.

గోపా॥ దుర్యోధనుండు చతురంగబలసమేతుండై వచ్చి యుత్తరదిక్కునఁగల గోధనంబునుబట్టి గోపాలకులఁగొట్టి గోవులఁదోలుకొనిపోవుచున్నాడు నేనాసంగతిందేవరవారికి విన్నవింపవచ్చితిని.

ఉత్తరుడు॥ అతఁడెవ్వరెవ్వరిఁగూడుకొనివచ్చినాడు.

గోపా॥ భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణ వికర్ణశకుని దుశ్శాసనాదిప్రముఖులఁబెక్కండ్రఁగూడికొని.

ఉత్తరుఁడు॥ మంత్రీ!

తే॥ ఇప్పుడీగోపపాలుండు ♦ చెప్పినట్టి
మాటలెల్లనువింటివే ♦ మంత్రివర్య
యీక్షణంబుననాప్రతి ♦ పక్షబలము
చలముమాన్పదఁగన్గొను ♦ సమరమందు॥

నేనుసంగరంబునకరుగఁ దలంచితిని నాకుదగినసారథినివిచారించుము.

మంత్రి॥ ఉత్తరకుమారా యీవచ్చినయోధాగ్రేసరు,లొక్కొక్కరొక్కొక్కలోకంబుజయింపఁ గలవార,లట్టిబలవిక్రములజయించుసామర్థ్యమునీకుగలదేనిచూడుము.

ఉత్తరుఁడు॥ [చిఱునవ్వుతో]

తే॥ అమితబలవిక్రమోపేతుఁ ♦ డనఁగఁబరగి
నట్టినాశౌర్యమెఱుఁగని ♦ యట్లుపల్క-
దేల నేవిల్లుబూనని ♦ రేఁడుజగము
లెల్లగడగడవడఁకవే ♦ రొలమిదక్క॥

ఇదియటుండ.

సీ॥ దుర్యోధనుండెంత - దుస్ససేనుండెంత
గంగాతనూజుఁడ - సంగనెంత?
గురుఁడెంతశూరుఁడు - గురుసుతుండనఁగెంత
అల్లాకృపాచార్యు - లనఁగనెంత,
కర్ణుఁడెంతోటివి - కర్ణుఁడెంతటివాఁడు
శకునిబాహ్లీకాది - నికరమెంత
కరలాఘవంబున - నరునకుసముఁడని
సురలెల్లదివినుండి - జూచిపొగడ॥

ఉత్తర॥ బృహన్నలా కౌరవులుకండక్రొవ్వుచేఁగల పశుధనంబునెల్లఁ బట్టిరనువార్తగోపాలురచే యుత్తరకుమారుండువిని సంగ్రామంబున కరుగఁ దగినసారధిలేమింజేసి యతివిషాదంబందుచుండ నీసైరంధ్రిచే నీకలతెఱంగెల్ల నెఱింగినిన్ను దోడితెమ్మని మమ్ముబంపనిదొకపనిబూని వచ్చితిమి నీవునామాట నలక్ష్యంబుసేయక నుత్తరునకు రథసారథివై జయలక్ష్మిని చేకూర్చజేయమని భవదీయశిష్యురాలి ప్రార్థనము.

బృహ॥ చిఱునవ్వుతో.

క॥ తేరునడిపింపగలనే
నేరుపుగానొట్యవృత్తి • నేర్పడినేనుక్
నారీమణిసీప్రార్థన
మారూఢిగమిగులజాల • నమ్మాకొమ్మా॥

ఐనను భవదీయప్రార్థనచే పరమానంద కందళితాంతరంగుండనైతిని ఇఁమీాదనుత్తరునికి సారథినై కౌరవులనెల్ల జయించునట్లుజేసి పౌరులకెల్లకు నేత్రోత్సవంబుగావించెద.

(ఉత్తరునిసభాభవనము బృహన్నలప్రవేశము)

ఉత్తరుడు॥ బృహన్నలా నీవిపీఠంబుపై గూర్చుండుము. (బృహన్నలకూర్చుండి)

బృహ॥ ఉత్తరుఁడా నన్నుబిలుపించిన కారణంబేమి.

ఉత్తరుడు॥

తే॥ వినుబృహన్నలకౌరవ • విభుఁడువచ్చి
పశుధనంబంతిచయ్యన • బట్టగోప
బాలకులుచెప్పవినిసూత- వరుఁడులేమి
యగుటననికేఁగుటకు వెను • కాడియుంటి॥

ఇకార్యము నీవల్లనెఱవేరునని సైరంధ్రి జెప్పగావిని నిన్నిచ్చటికి బిలుపించితిని.

బృహ॥ (భయమభినయించుచు)

తే॥ ఆటపాటలనభినయపాటవములఁ
జెప్పుకొని బ్రతికెడువాఁడ; నొప్పిదముగఁ
బ్రథనమందీవు మెచ్చఁగా- రథముఁగడుప
నెంతవాఁడను నెవ్వరి; నేనిజూడ॥

ఉత్తరుడు చిరునవ్వుతో అటులయినపనరే ఖాండవదహనాది భండన మున గాండీవికి రథమునడిపిన ద డిపగాక్రమము నెచ్చటబాచివచ్చితి వో ఇప్పుడు నీవిప్పనికొప్పక తప్పుకొనజూచినను నిన్నుసారథిగాఁ జేసి కొనక యుద్ధంబునకు నడచుమాటల్ల ఇకఁ ట్టివృథా ప్రసంగముతోఁ గాలయాపనము జేయక స్యందనంబా యత్తంబు జేసికొని తో డితెమ్ము పొమ్ము.

బృహ॥

తే॥ నీకృపారసమునకును; నేనుదగిన
యట్టివాఁడను దారత- మ్యంబెఱింగి
పనిగొనందగుమీాయన్న- పానములను
దినుచుమీామాటదాఁటుట; ఘనమెమాకు॥

ఉత్తరుడు॥ బృహన్నలా జాలమేలజేసెదవు నాశతాంగంబు సమస్త శర శరాసనాద్యాయుధ సహితంబుగా శృంగారించుకొనిరమ్ము.

బృహ॥ ఇదిగో దెచ్చెదను.

(నిష్క్రమించిరథముతో బ్రవేశించి)

క॥ నీరథమారోపింపితో
సారథినై కురుబలంబు; జయ్యనగెల్చే
తి రేఁ ఱేఁగిజరిం చెద
నారూఢి పింపర్యు; లానందింపఁగ॥

ఉత్తరకుమారా యీసించాన సధ్వజంబుగల రథంబునెక్కుము.

ఉత్తరుడు ఆలాగేరథారోహణజేయుచున్నాడ.

(అని రథంబెక్కుచున్నాడు)

ఉత్తర॥ అన్నా మీరక్కౌరవబలంబును జయించి వారిశిరోవస్త్రంబులలో జిత్రవర్ణంబుగలవాటినెల్ల నాబొమ్మపొత్తికలకు దెచ్చి పెట్టవలశినది

బృహ॥ ఉత్తరా యితండు జయలక్ష్మింజేకొనునా వినదియొకలెక్కగాదు ఎట్లనైన జిత్రవర్ణాంబరంబుల నేనె దెచ్చిపెట్టెదను.

(అనిబృహన్నలరధమునుదోలుచున్నాడు (గోపాలులుప్రవేశము)

గోపాలా॥ ఉత్తరకుమారాదండములు.

ఉత్తరు॥ శుభమగుగాక. గోపాలులారా మీరెచ్చటనుండివచ్చితిరి

గోపాలు॥ ఉత్తర దిశనుండి.

ఉత్తరడు॥ కురువరేణ్యుండే దిశగలగోవులఁబట్టి దోలుకొనిపోవుచున్నాడో.

గోపాలు॥ పితృవనంబువలనిగలవెల్లను.

ఉత్తరుడు॥ బృహన్నలా

తే॥ తడవుసేయకరథంబు- దక్షిమినడుప
సమరులడ్డమువచ్చిన- నడలఁగొట్టి
కురుబలంబునుబడఁగూల్చి- గోధనంబు
క్షణములోమరలింతును- త్వాహమొప్ప॥

బృహ॥ రధమునతిత్వరగా నడపించెద. (అనిరధముదోలుచుండునంతలో (ఉత్తరుడు కౌరవసేనఁజూచిభయమభినయించుచు.)

సీ॥ కిదనంబు నేసల్పఁ- గాజాలనో బృహ
న్నలనీపదముసాక్షి- నిలుపురధము
కౌరవాళిఁబోడఁ- గానగానాగుండె
చెదరెగాభయమెంతో- జెందెమనము
దుర్యోధనుఁడు- కర్ణ దుశ్శాసనాదుల
శౌర్యధైర్యంబులె-చ్చటనుగనము
కార్ముకశంఖభే- కరతరధ్వనులచే
ధైర్యముచెడిమొవే- దనముఘనము॥

తే॥ గీ॥ మాటలేటికికౌరవ॥ కోటిసాగ
రంబునీదగఁజాలరి॥ ధంబురయము
జెలఁగమరలించుకొనిపురి॥ జేరిప్రాణ
ములనునిల్పుకొనుటమేలు॥ గలదువినుము॥

బృహన్నలానామనవివిను (అనితిచ్చపడును)

బృహ॥

క॥ కలనమొనరించుచోనరి
బలమొగితనబలమునుమించఁ- బౌఱఁగవలయుఁ
గలఁగన్నరీతిబరిసే
నలఁగనుఁగొనిపాఱిపోవ॥ నవ్వరెజనముల్॥

ఇదిగాక

సీ॥ తగుదుపటంచనినుగవానినలెవచ్చి॥ వగవానిగనియిట్లు
పారిబోవ- యాలమందనున్నారి
కిర్పించిమేదినీ పాలనందనయిట్లు
పారిబోవ- దూరంబుగానున్న
కౌరవులనుగాంచి- పోరాడఁజాలక
బారిబోవ॥ సరిసవా బుద్ధిని
శౌరిమనలఁబ్రోవ॥పఁదలవలెనిట్లు- పారిబోవ॥

తే॥ తేరునేదోలఁబురిలోకి- జేరఁగానె
పౌరులెల్లనుగనుఁగొని- పరిభవంబు
జేయుటయగాక హేళన- జేయునిజము
నవ్వుబాలైనపిదపజ- న్మంబదేల॥

ఉత్తరకుమారా యొక్క-ఈగాంబులో గౌరవుల నోటుబుచ్చిగోవుల దోలుకొని పురప్రవేశమవ్యోదము భయపడకు నామాటవిను తత్తరబడి మనముతిరుగ బురిజొచ్చుటకింటె మరణమెక్కుడనున్నది.

ఉత్తరుడు (దీనుండవు) బృహన్నలయూరి దెసకు తేరును మరల్పి

నన్నుద్ధరింపుము. పాయకుంబుకన్న ప్రాణములులేపియును సాధ్విత. నీవా
లుంగవా.

బృహ॥ అవును ఎఱిగినసేమి

తే॥ పసులఁ దెచ్చెదమని పల్కి - బరవసముగ
మేటిలాగున రథమెక్కి - చాటుబట్టి
శంఖనాదంబులును వైరి - సమితిగాంచి
బెగ్గడిలనేల సత్కీర్తి - బెందువడగ॥

నీవకౌరవసేన యుగ్గలికకు బెగ్గిలి పరుగిడదలంచినట్లైన పశుధనంబును
సంగ్రహించవచ్చిన పగవారందఱు పకపకనవ్విపోరా

ఉత్తరుడు॥ (తనలో) అమ్మో నాకీగతి యేలరావలెను. (ప్రకాశ
ముగా) బృహన్నలా

చ॥ వినుము సుశర్మ సేనబల - విక్రమసంపద బెంపుమీరగో
ధనమునుబట్టి మత్స్యపతి - దర్పమెలర్పఁగ సైన్యసంఘముల్
గొనకొని వోడఁజేసికొని - క్రూరులఁదునిశ్చడగించఁజాలరెంగా
వున మనమింటివారిపయిఁ - బోవుటమేలగునే బృహన్నలా॥

పశులదయ్యమెఱుఁగుగాని నీపుణ్యము. రథమునిల్పుము. నన్నింకు కేడిపి
పవు. (క్రిందిదిగువారకుండి) నిన్నెంత వేడుకొన్నను జాలిఁబడవేమి

బృహన్న॥ ఉత్తరుఁడా. నేను నీకుసారథినై రథముసాగదోలునపుడు
సామంతులతిసంతసంబుగా నజ్ఞానునకెట్లు జయంబాపాదించితివో
న్నే యయ్యుత్తరునకు జయంబొనగూర్చుమని యాశీర్వదించిరే
యము తగుదుమని యరదంబును తిరుగ బుద్దిలోని కెట్లుతోలుకొని
ము. శభాషు. నీబంటుతనముదలంచ నాకేసిగ్గగుచున్నది. నీకేలుకి

త్తరుడు॥ అయ్యో కాంతామణులసంతోషముతో నా [illegible]

కాలహరణము చేయక నతిగుట్టుగా నరదంబును తిరుగవురికిమరల్చి నా ప్రాణంబులు నిల్పుము.

బృహ॥ నేనుపశుధనంబును సంగ్రహించక రథమును వెనుకకు మర ల్చుటకల్ల

ఉత్తరుడు॥ అయ్యో తండ్రీ

తే॥ జాలమిచ్చోట జేసినజ - జంపదలంచి
నాడవబ్బబ్బ నీకుమా - కూడుగుడ్డ
లింత జేసె నేడ్పించక - నిల్లుజేర్చు
కూలివాడింటిమగండయ్యో - గాలమేటి॥

బృహన్నలా తుదకు నన్వైరోధులచే జంపించదలంచి రథమును వెనుక కు మరల్పక సమరస్థలి సమీపమునకు దోలుకొని పోవుచుంటివే నేనే యునదేమిటి (దిశలుజూచి) యిదిగోనేనురథంబు డిగ్గిపోవుచున్నాను.

(అని రథమును దుమికిపోవును-)

బృ॥ ఉత్తరుడా. నిలు- నిలువు.

(అని వెన్నంటిపరుగెత్తుచున్నాడు)

ఉత్తరుడు॥ నేనొకనిమిషమైనను నిల్చియుండలేను.

బృ॥ నిన్నొకయడుగైన కదలనిత్తునా. (అని పట్టుకొనును)

(ఉత్తరుడు దీనుండై) బృహన్నలా కౌరవసైన్యమందుబుట్టిన వా ఘోషమురొంకక- ప్రతిధ్వని వినవినయుద్ధముజేయవచ్చియున్న నాక చేతులు మొదలగు అవయవములు శిథిలమగుచున్నవి. నోరెండుచ ది. దేహమునందువణకును. రోమాంచములును గల్గుచున్నవి. నా నోండు వెల్లజారుచున్నది. నామనస్సునకేమియుం దోచక రథమువి ల్చుటకు శక్తిలేనివాడనైయున్న నన్నుబట్టి యేలబాధించెదవు. న నాలించి విడిచిపెట్టుము. నీకుపది వేలవందనములుగాని విడిచిపె

(అని గడ్డముబట్టుకొనును)

ఉ॥ కౌరవవీరులన్గలిన - కన్నులకుంభమగ్రగమ్మ నిల్వవిూ
నూహవరాల్క పెంపొజ్వలము - ఖలగజఘోటశతాంగయానదా
సీరుచిరాంబరాభరణ - సేవకుల న్మరియూళ్లుగొన్నిమా
యూరుసారంగనిత్తుమన - ముక్కటియింటికిఁబోవమేలగున్॥

అయ్యో బృహన్నలా. నాముద్దుచెల్లెలను నారాకకెదురుచూచు సుధేష్ణాదేవిని కన్నదమ్ములతో నొక్కసారిగన్గొని వచ్చెదగాని నన్నువిడిచిపెట్టుము.

బృహ॥ ఉత్తరుడా

ఉ॥ ఏలనొకోభయంబు మతి - యేకొకకొండగవిల్లివైరులం
దూలఁగగొట్టగం రథము - దోలగఁబూనుము సూతవృత్తిచే
గ్రాలెడి వైరివర్గముల - గాలిని పిపములఁబోకకుండ నే
నాలను దోలిదెచ్చెదశ - తాంగము నెక్కుమా [illegible]గు నేయకన్॥

నేనురథికుండనై కురుబలంబు నెల్ల గుట్టలుగుట్టలుగాఁ గొట్టి మనగోధనంబును మత్స్యపురికి దోలుకొనివచ్చెద నామాటనమ్ము.

ఉత్తరుడు॥ నేనుసారథిగాగూడ రథముపైనిల్చియుండలేను నన్ను విడిచితివేని యీమేలు నేనుబ్రతికియుండునంత దనుక మరువఁజాలను.

ఉ॥ (అని పెనుగులాడుచు)అయ్యో భగవంతుడా, నాకెంతగతిసంభవించినది (అనునంతలో అర్జునుడుత్తరునిబట్టి నొగలనడుమబెట్టికట్టి తానురథమెక్కుచు)

బృహ॥ ఉత్తరకుమారా జడువకుసుమీ

ఉత్తరుడు॥(వణకుచు) నేనెంతజడిసినను నాకీసారథ్యము తప్పనుగదా.

బృహ॥ నేనుగల్గ నీకేమిభయము రథంబు హెచ్చరగా సాగదోలుము.

ఉత్తరుడు॥ నేనిత్తెరుదోలకున్న నీవు బొలుఁగని నీవుజాలిఁబడి యూరకుండెదవా.

బృహ॥ నేనూరకుండి నీకుమంచివాడనగుదునా

ఉత్తరుడు॥ నాకర్మముచాలక నీకీకఠినబుద్ధిగల్గినదిగాని నీవుమంచివా చెవ్వుగాకేమి

బృహ॥ ఇకనీమాటలుచాలించి ముందుజరుగు సంగతి నాలో చించుము.

ఉత్తరుడు॥ నేనంతవాడనుగాను.

బృహ॥ నీసంగతి నేనెఱుంగననుకొంటివా.

ఉ॥ నీకుదెలియనిదేమియున్నది.

బృహ॥ అవునుగాని

తే॥ ఉత్తరకుమార యిచ్చోట - నొగిరథంబు
నిల్పుమీ జమ్మిచెట్టుపై - నెమ్మిదనర
పాండవులుగూఢచర్యస - ల్పంగబోవు
నపుడుశస్త్రాస్త్రములుదీని - యందునిడిరి॥

ఉత్తరుడు॥ అలాగే రథమునునిల్పెదను—

(అని రథమును నిల్పుచున్నాడు.)

తృతీయాంకము,

సంపూర్ణము.





## చతుర్థాంకము ప్రారంభము.

ద్రోణభీష్మ కృపాశ్వత్థామ దుర్యోధన దుశ్శాసన కర్ణ వికర్ణాదులు ప్రవేశము.

(ద్రోణుడు తనలో) ఈవచ్చు పుణ్యాత్ముండాతఁడు చందంబును బురుషాకృతియు గల్గి నివురుగప్పిన నిప్పువలె గనుపట్టుచున్నాఁడు. (బాగుగా బరికించి)

తే॥ భుజములు చాయయును నడక నింపు-గనుఁజూడ
నర్జునుండని యనుమాన - మందె మదికి
సందియము లేదు మత్స్యావ - సుంధరేశు
నింట నజ్ఞాతవత్సరమిట్లు జరిపె॥

మనయర్జునుఁడే, యిట్లు చేటి యై యుండకున్న నొంటొరులు కౌరవులతో గయ్యంబునకుఁ గాలు ద్రవ్వి కదలి రాగలరా. విరటుఁడు పురిలోఁ గలరథికుల గూర్చుకొని దక్షిణగోగ్రహణమున కరిగియుండుట చేతఁ జిన్నవాఁడగు నుత్తరుని రథసారథిగాఁ జేసికొని తానే వచ్చుచున్నాఁడు.

(పరికించి ప్రకాశముగా) భీష్మా ఉత్తరుండు తత్తరపాటుచే రథము దుమికి పారిపోవ నూరడుగుల దూరంబున బట్టి తెచ్చి నొగలఁ బైబెట్టి తానే రథికుఁడై గనుపట్టునపుండతం డెవ్వఁడో బాగుగా యోచించుము.

భీష్మ॥ ద్రోణాచార్యా. నామదినూహించగా నీవిరాటునిపురంబునం దర్జునుండే యీనీచరూపము గైకొని యింతవరకు తలదాచుకొని యుండి యుత్తరునికి సారథిగావచ్చి తిరుగ నింతపని జేసినాఁడని తోచుచున్నది. ఆహా! మనమవ్విజయుని యెన్నాళ్లకు జూచినవారమైతిమి.

ద్రోణు॥ గాంగేయా! యితండజ్ఞాతవాససమయభంగమగునను సంశయమిసుమంతయైనను లేక గురువీరులకు దనరూపము బొడసూపవచ్చుచుండె, నేమివీని యహంకారము. ముందుసంగతి దెలియదు కాఁబోలును మీ.

భీష్ము॥ (ప్రకాశముగా॥ యోధులారా.

కం॥ పగతులకిమ్మగు కాలంబని

దిగబుచ్చియయుటకువచ్చి - తిమిభుజబలము

త్యాగశీతగతి నెఱపుటకిది

తగుసమయము వచ్చె వెఱువక - దగదరితతికిన్॥

ఇదియుండ

సీ॥ చుక్కలగమి రాలెని - జోదుమాసెనుగాక

నక్కలు గూసెను - నాల్గుదిశల

దమాయంతదూర్గ్యముల్ - తగిలివేగుగ్రమోసె

మ్రోగ్గనుమిన్నకి - నిగ్గజంబు

లగ్గలంబుగదురం - గావలి కన్నీరు

వదలుచున్న విధ్వజా - వళిచలించె

నాయుధంబులు గగ్గ - మైనట్లుగింపించె

ధైర్యశౌర్యంబులు - దరిగిపోయె॥

తే॥ దిక్కులను ధూమమెసగెసం - దిగ్ధముగను

పుట్టదగినట్టి యుత్పాత - ములుజనించెఁ

గానవోపిన కుంతగాఁ - గాచికోనుడు

వెఱపు జెందక పశులను - బెదరనీక॥

ఆఁకలిగొన్న సింగమునుంగుపైకి దుంకురీతి భీకరాకృతితో బాకారితనూజుఁడు మనపైకి బవరమునకు వచ్చుచున్నాడు. బాగాపరికించండి

ద్రో॥ (చూచి) కర్ణాఘాలాతస్సుకీతి నరుదెంచు నరునిజయించి గోవులఁదోలుకొనిపోవుట కలవిగాదని దోఁచుచున్నది.

కర్ణు॥ (కోపముతో)

ఉ॥ పాండవపక్షపాతివయి - పంటివిధంబున వైరినెంచెగా

ధంఘనమునమున్న నుతిఁ - బాండవమధ్యము తెంతవాడునా

దండిబలంబుఫల్గుణుని - దాడికినోడునటంచు మీరలి
ట్లుండిరిగాసిసుంతభయ - ముండను నాకతనింజయించగన్॥

మేలుమేలు. దుర్యోధనచక్రవర్తి కార్యంబుగల్గు నట్లయ్యెనాకనుంబో గడుటచాలింపుము. ఈనచ్చువాడేయర్జునుండన్యుడేని యస్మదీయవి శిఖశాతచలిత చిత్తునిగాఁజేసి మనయోధుల కెల్లగను నేత్రోత్సవంబుగావించెద. నాప్రజ్ఞజూడు.

ద్రోణు॥ సరిసరి బాగుగానున్నది నీవు పరాక్రమహీనుండవని యెవ్వానిరి నీవటుండుము దుర్యోధనా, మనసేనాసమూహమునం దపరిమితముగా నపశకునంబులు గనుపట్టుచున్నవి, పరికించగా మనకీసంగర జయంబులభించుట దుర్భరంబని స్పష్టపడినది.

అశ్వ॥ నిజముగా నట్లనేయున్నది.

దుర్యో॥ కోపంబుతో) ద్రోణాదులారా! మనుష్యునకు రోషమైనను రాజ్యాభిలాష యైనుండవలెఁగాని వందిజనము రీతిబగతుని యిట్లాశపద్దగాఁజేసి పొగడుట మీకొంట్లకు మేరగాదు.

చ॥ కదుభయమందిమీరు వెను- కంజెరలాడుచుయుద్ధమందరీ
జెడబడఁగొట్టిగాండీవము- చెండికపిధ్వజమున్ప్రెంచియా
తొడుకులమంగఁదోలుకొని- దోవాదమొప్పఁగపార్థపత్తనం
బుకుగనిసంతసంబునను- హోన్నతిఁజేరెదనీబలంబుతోన్॥

ఇతరులెవ్వరైన నిదివిని నవ్వుదురనులజ్జలేక విజయునివంది విధంబుగాఁ బొగడుచు మదీయసైనికులఁ దిరస్కరింపుచుంటిరి మీరు బ్రాహ్మణోత్తములగుటచే బ్రాహ్మణుల యిండ్లలో నుచితాలాపంబు లాడుచు బ్రాహ్మణార్థములు చేయనెరుంగుదురుగాని సంగ్రామమున గలతెఱంగెఱుంగరు వినను. మీరుగురువులుపూజార్హులగుటచే మమ్ము మీరుతిరస్కరించినను మిమ్ము మేము తిరస్కరింపలేక నూరకుంటిమి.

ద్రోణు॥ అశ్వత్థామ యీదుర్యోధనుని వాక్యంబులు వింటివా.

అశ్వ॥ (కోపంబుతో)

ఉ॥ గోపకుమారులంబోదివి - గోవులఁబట్టిన యంతచేతనే
ప్రావుకు జేరెదోఁదగిన - పౌరుషముంగనుగొంకు ముంకఁనీ
వీపాలిమేరబాటగల - వేసరుఖారిని బద్ధమీఁద నీ
యేపుదొరింగునింత - దుడుకేలనుయోధన ముందుజూడుమా॥

రణరంగంబున విరోధులఁజయించి సాంబ్రాజ్యంబు గైకొన్నపరాక్రమ వంతుండైన నింతగా ప్రేలఁజాలడు మాయాద్యూతంబున పాండవుల నోడించి వారిరాజ్యం బపహరించి ద్రౌపదిని సభలో మానభంగము గావించినను ధర్మజారుకుశనిహాతిచే సమయభంగంబగునని సంశయించి పాండవులింతదనుక నూరకుండిరిఁ యిప్పటికమ్మచ్చరంబు దీర్చుకొన విప్వచ్చుఁడెతెంచుచున్నవాడు.

సీ॥ దుర్మదత్వంబుచే - ద్రోణునిదూలఁగా
వచ్చి నదజానుగెల్వ - వశమెనీకు
ప్రియశిష్యుబలమెల్లఁ - దీర్కనగురునకు
దప్పగుననిమదిఁ - దగిలెనీకు
సిగ్గుమాలి రణంబు - జేసిన ద్రోణుండు
సేయఁదొడంగునేఁ - జేయనీకు
వింతకుమాలమై - యేతెంచుశకుని స
హాయమమా యుద్ధంబు - నందునీకు॥

తే॥ గానయివిమాయపాచిక - ల్గావుగెల్వ
నరునిబాణంబులనిమది - నాటిమేను
ఇచటనిల్వక నెచ్చోటి - కేనియేఁగ
దలఁచియుండిన మాకెంక - దర్పమేల॥

దుర్యోధనా ప్రళయకాలరుద్రునినైనను, బడబాలనంబునైనను నిల్పఁదర మగుఁగాని నరుని శరపరంపరలునిల్ప నీదరమా యయ్యర్జనుండు మ.

ధ్యందిన మార్తాండుభాతినుండు, శరకాండంబులం వేయుచుగాని నీవలె
మాయపాచికలు వేయునా, మేమయ్యుత్తరు నొక్కరుని యుద్ధమందు
జయింతుమంటిమిగాని, యర్జునుని జయించగలమని నీవలె ప్రతిజ్ఞలు
బల్కితిమా, అయినను, మాకు బెక్కుమాటలతో బనియేమి మాయిచ్చ
వచ్చినచోటికేగుదము

దుర్యో॥ రాధేయా యశ్వత్థామవచనంబులువింటివా.

కర్ణుడు- వింటిని (కోపముచెందినవాడై) యోధులారా.

ఉ॥ పాండుకుమారుల్వనము - పాతరలాడగవచ్చి మత్స్యభూ
మండలనాధుమందలన - మందగతింగ్రహియించి యిండియు
గ్గాండివిఁజూచియు న్వెరపు - గల్గియు మేమెటకేఁగెదన్నమి
మ్మందఱ వేసువారలెవ - రందనుకర్ణ వసించుఁడింటికిన్॥

యోధాగ్రేసరులారా, నేనికౌరవులలో నధికబలవంతుడనని ప్రఖ్యాతి
కెక్కితిని అట్టిబలవిక్రమంబులుగల్గ పదుమూడుసంవత్సరంబులు వనంబు
లందెలాఁడి ఆకలములుమెక్కి బక్కయైయున్న యర్జునునకు మనము
చిక్కుదుమా మిక్కిలిగా నుక్కుచెడియున్న బక్కవానిబట్టి కొట్టపడు
గురుకావలెనా- మీరిక్కడనేఁల్చినా యపక్రపరాక్రమంబు బరీక్షించు
చుండ నేనొక్కండనే యక్కిరీటినిబట్టి ముక్కుమూటుగా గొట్టివచ్చెద
జూడుడు.

ద్రోణు॥ కౌరవులారా. మనకిప్పుడీమాటలవైఖరి భాగుగాపరిమా
నగదించవచ్చును.

కృపుం॥ (కోపముతో) కర్ణా॥
సీ॥ ఒక్కఁడేఁగద యింద్రు - నోడించి ఖాండవ
మగ్నికినిడిరోగ - మణచువేళ
నొక్కఁడేగాదె వీ - రోత్తములనుగెల్చి

హెచ్చిసుభద్రను - దెచ్చువేళ
నొకఁడౌ గంధర్వుల - నొగిబట్టి పడఁగొట్టి
కురునాథువిడిపించ - గోరువేళ
ఒకఁడేగదానివా - తకవచులనుబట్టి
యాంచితగతిని ఖం - డించువేళ॥
తే॥ ఒక్కఁడే యర్జునుండని - వెక్కసముగ
నిక్కిపల్కెదవేగాని - నిక్కువముగ
నతనితోఁబోర హరిహరు - లైనఁజాల
రెంతవాఁడవు నీకింత - పంతమేల॥

కర్ణా ఒక్కఁడేయనవలె నొక్కియున్న యర్జునుండొక్కఁడే గదాయని పెం పెక్కి సిగ్గుమాలి వానిమాటలెక్కఁబోవుట చూడ సముద్రంబుఁజే యీఁత నీఁదినట్లుగా నెగ్గుండుగాదు. గాన నీవీవీరప్రజ్ఞలుమాని ద్రోణాచా ర్యులంగూడికొని యత్నించుదము. కాదేని మానప్రాణంబులు గోలు పోవుట నిశ్చయంబని తెలిసికొనుము.

కర్ణు॥ ఇక్కురువరేణ్యుండు వట్టిబేలగావున మిమ్మెల్లరఁ బాండవప క్షపాతులని గ్రహించక యుద్ధమునకు సహాయము జేసికొని వచ్చినాఁడు. మీవల్ల నితనికి సుమంతైనను లాభము లేదు. ఏనను మీయాలు బిడ్డలాదిగాఁ గలవారెల్లరును ఇక్కురునాథుని సొమ్ముగుడుచుచు, సమ సమయమువచ్చువరకు వెనుకొండుచున్నారు మీరెంతటివారు.

సీ॥ గురువులు మీరు సం - గరవేళ కోరగారు
బ్రాహ్మణార్థములకు - బాగువారు
అట్లుపాయసము జి - త్రాన్నము భక్ష్యముల్
తిని జుట్టుదువ్వించు - కొనెడివారు
పప్పుదప్పళములు - దొప్పలతో నెయ్యిఁ
గలిపి యాహారించ - గల్గినారు

ద్విగుణము దక్షిణల్ - దెస్మనిసత్యంపు
పొట్లంబులకు - వెంగబోదువారు॥

తే॥ ఇట్టిబలశాలులరుదెల్లఁ - బట్టకేని
పూర్వపుణ్యానఁ నడకది - స్వామిలోన
యేను విల్లందికొనయేని - యీజగముల
నవవనవనదంతు నాయకా - పారమింతు॥

భీ-శ్రే ముందెటికంకారమ్మున కర్ణమేలనన్నట్లు మీరాధయిర్యసాహసంబులీ మాటలలోనే తేటలగుచున్నవి.

కృపా॥ భీష్మా కర్ణుని దుర్మతులు వింటివా?

తే॥ పక్షపాతంబు గల్గిన - వారమగుచు
నిందునుండఁగ బనియేమి - యింక మీఁద
నిచ్చవచ్చిన చోటికి - యేఁగదలఁచి
యున్నవారము మాకాజ్ఞ - నొసగుమయ్య॥

భీష్మ॥ (చిరునవ్వుతో) కర్ణునిమాటలతో నేమిప్రయోజనము మీరు శాంతింపొందుఁడు కర్ణా॥

ఆ॥ నిందసేయదగదు - నీవుబ్రాహ్మణులను
నాల్గువేదములకు - నాకరాంత్రి
మండెమేలమునను - మర్యాదవిడిపల్కు-
రెంతవారలైన - నేమికర్ణ॥

కర్ణు॥ గాంగేయా వీరిని నిందించ నీకు దగదంటివిగదా నన్ను వీరునిందించవచ్చునా.

భీష్మా॥ చాలు! నీమాటనిల్పుము - రాజేంద్రా యీయాచార్యుల వాక్యంబులమోఘంబులు. కర్ణుండుమీకుమన్ననగలవాడగుటచేతమీరు మెచ్చుకొనునట్లు హెచ్చుగా భాషించినాఁడుగాని వీరినినిందింపఁదగి

గడు పేహపూజ్యుమటకు దగువాడుగాని తిరస్కరించ దగినవాడుగాడు. దానరి తప్పునందనుగోఁ బోవుచున్నట్లు మన మెల్లర మీయాచార్యులఁ బ్రార్థింపుదము రండి.

సుయో॥ అట్లనే ప్రార్థింపుదము.

భీష్ము॥ చం॥ సుగుణమున మీచరిత్రములు - గన్గొని నీదివశంబుగా మన క
గ్గునికని నోర్తులి త్రుటిని - ద్రూథనుమీ మదిఁ జేయకండి యు
ష్పని నెలవేట్టుకీరలని - భారము బెట్టితి తప్పులంతయు మా
పగ దాలఁగి జేసికోప మీద - బాటిల జేయకుడంచు వేడెదన్॥

కౌరవులఁ బోరాటమందు బీటువోనియుని భారకర్తలు మీరేనని న మ్మినిక్కలిగా బ్రార్థించుచుంటిమిగావున మా నేరములకు మిమియుంచి వి రోధంబు విసర్జించి యర్జునుని జయింపవలయునని కోరుచున్నారము

ద్రోణు॥ చిరునగవుతో

తే॥ ధార్తరాష్ట్రునికరుణకుఁ దగినవార
మగుదుము తాతనిఁ జెప్పెద- మాతలంప
శత్రులము మేము శంతను- పుత్రముఖ్య
పోగడఁగ నేల నరుఁ డిట్లు- దగిలివచ్చె॥

అర్జునుండరణ్యవాస మజ్ఞాతవాసములు గడపి కడుగాసింబడి యతి రోషావేశుండై వచ్చుచున్నాడు గావున మనలఁగాంచి సైరించఁబూనడు మీఁద మీరెల్లరు జాగుసేయక మన సేనలనెల్ల గుమిగూర్చికొని గోవుల జెవరకుండ నల్లనల్లన డుమన్నట్లు జేయుఁడు.

కర్ణుడు॥ అలాగే జేయువాడను.

(బృహన్నలయుత్తరుఁడు ప్రవేశము)

బృహ॥ ఉత్తరకుమారా యీశమీవృక్షంబునఁ బాండవులు సమస్త యుద్ధంబులు గట్టికట్టిపెట్టిరి అకట్టవిడిచి యందుఁ గల పాండవమధ్యముని గాండీవంబు బుచ్చుకొని తక్కినవి యప్పటియట్లుంచిరమ్ము.

ఉత్తరుడు॥ పాండవులుతమ శరశరాసనంబు లిందేలయుంచిరి

బృహ॥ వారజ్ఞాతవాసంబునకేగుచు సమస్తాయుధంబులు నీచెట్టుపై బెట్టిపోయిరి.

ఉత్తరుడు॥ ఏకొమ్మపైన.

బృహ॥ తూర్పుభాగంబుగాంబోయిన కొమ్మయందు.

ఉత్తరుడు॥ ఇదిగోచెట్టునెక్కి యాయుధములకట్ట విడచెదను.

(అనిచెట్టెక్కి ఆయుధములకట్టజూచి భయపడిదిగుచు)

తే॥ అక్కటా యస్త్రములకట్ట - యనుచుదిట్ట
ముగమనుష్యకళేబరం - బును వడిగను
జూపుచున్నాడవేనురా - చూలినగుచు
ముట్టగారానిదిదియెట్లు - ముట్టగలను

బృహ॥ ఉత్తరకుమారా మనుష్యులంటకుండునట్లు మఱువడఁజేసిన యాయుధప్రచయంబుగాని శవంబుగాదు । నామాటనమ్మి జమ్మిపైనున్న గాండివమ్ము నాచేతికందిమ్ము.

(ఉత్తరుఁడు సందేహించును)

బృహ॥ ఉత్తరుఁడా పనికిమాలినపనికి నిన్ను బంప నేనంతవ్యర్థుండనా సంశయపడకు. కానిమ్ము. గోవులుదూరంబగుచున్నవి.

(ఉత్తరుడు తిరుగవృక్షమెక్కి)

ఉత్తరుడు॥ బృహన్నలా. ఈవృక్షరాజమెక్కితిని. ఇకజేయవలసిన కార్యమేమి.

బృహ॥ శస్త్రాస్త్రసంచయంబందుకొని త్వరితగతి విడిచి పెట్టుము.

ఉత్తరుడు॥ ఇదిగో విప్పుచుచుంటిని.

(అనికట్టవదలుచు భయముతో)

బృహన్నలా. ఇవి పెనుబాములవోలెం బుస్సుబుస్సుమనుచున్నవి. మనోదృఢత్వము క్షీణించుచున్నది. కన్నులు మిఱుమిట్లు గొనుచున్నవి.

(అని వడకుచున్నాడు)

బృహ॥ ఉత్తరుఁడా భయపడకు నిదానము తెచ్చుకొమ్ము యీశరంబులు పరులుముట్టకుండునట్లు పాండవులట్లుగావించిరిగాని యివిపాములుగావు బాగాపరిశీలించుము.

ఉత్తరుడు॥ (దేరిపారచూచి) బృహన్నలా బాగుగా వీక్షించితిని నిదానము తెచ్చుకొంటిని కొండచిలువరీతి మండిపడుచున్న యీ కోదండంబా పాండవుల యందెవ్వరు బట్టెదరు.

బృహ॥ అదియేగాండీవము పాండమధ్యముండు దానివలన నమరేంద్రాసురలనైనను సమరమందొకక్షణములో నేలపాలుజేయ గలఁడు

ఉత్తరుడు॥ ఈధనస్సునెవ్వరుబట్టుద

బృహ॥ ధర్మరాజు.

ఉత్తరుడు॥ ఈధనస్సు.

బృహ॥ భీముఁడు.

ఉత్తరుడు॥ ఈచాపము.

బృహ॥ నకులుఁడు.

ఉత్తరుడు॥ ఈవిల్లు.

బృహ॥ సహదేవుఁడు.

ఉత్తరుడు॥ ఈగదాయుధము.

బృహ॥ భీముఁడు.

ఉత్తరుడు॥ ఈశస్త్రాస్త్రంబులీ వృక్షంబుపైఁబెట్టి కొంతేయులేడకరిగిరోగదా.

(అనిచింతతో)

తే॥ అక్కటాధర్మరాజెందు - నడఁగినాఁడొ
భీమపార్థులవర్తన - మేమొమాద్రి
తనయులెచ్చోటదాఁగిరో - ద్రౌపదియెట
నెట్టిపాట్లఁ గుడుచుచుండెనో - యెరుగరాదు॥

ఆహా పంచపాండవులనఁగా బరమధార్మికులు బంధుహితకార్య పర
తంత్రులు అమితపుణ్యాత్ములు అట్టిమహానుభావులెట్టి కాపురుషులచే
నెట్టికష్టములుబడుచుండిరోగదా ఏమియీకాలమహిమ.

(అనిదీనతజూపుచు)

బృహ॥ ఉత్తరుడా॥

తే॥ పాండవులఁగూర్చిఁవగవంగ - వలదునీవు
విధివశంబునవచ్చిన - వెతలకోర్చి
కానఁదప్పకఁదారుద్రౌ - పదియరణ్య
మందుద్వాదశవర్షఁబు - లుండిపిదప॥

ఈపదమూఁడవసంవత్సరమున మారువేషంబులుదాల్చి యజ్ఞాతవా
సంబు సలుపనెంచి యిమ్మత్స్యపురిలోనే బ్రవేశించియుండిరి.

ఉత్తరుడు॥ (ఆశ్చర్యంబుతో) పాండవు లిప్పుటనేమి వేషంబులు
ధరియించియుండిరి

బృహ॥ సీ॥ సకలధర్మాధర్మ - శాస్త్రజ్ఞుఁడగుకంక
భట్టువైవస్వతు - బట్టిసుమ్మి
వంటలవారిలో - నన్నికనెక్కిన
వలలాంకుఁడేగాలి పట్టిసుమ్మి
తురగంబులకుశిక్ష - గఱపుదామగ్రంధి
మాద్రిసంతతిలోన - పెద్దసుమ్మి
గోవులఁగాచెడి - గొల్లలమేటితం
త్రిపాలుఁడేసహ - దేవుఁడుసుమి॥

ఆ॥ వె॥ దేవిచెంతదాసి - గావెల్గుమాలిని
ద్రుపదరాజపుత్రి - దోహదముగ
నింకఁగొంతవేళ - యేనర్జునుండనీ
మదినిసందియంబు - గదునీకు॥

ఇదిగాక ద్రౌపదిని మోహించిన సింహబలునిని యతనితమ్ములను గంధర్వులను నేపంబున వాయునందనుండగు భీముండే యమపురంబున గాపురంబుండ బంపినాడుగాని యొరులెవ్వరునుగారు.

ఉత్తరుండాశ్చర్యంబుతో॥

ఉ॥ నమ్మెదు నేబృహన్నలధ - నంజయుఁడన్నమాటనేనటన్న మా
యమ్మపదమ్ములానయివు - డారయమండుడవౌదువీచరి
త్రమ్మగసంగజోద్యముగ - రంజిలెనాఁతమశైలధీరుఁడా
సుమ్మిదిసత్యమంచుమది - నూటిగనుందునెవిన్న వారికిఁ॥

బృహన్నలా అర్జునునకు దశవిధనామంబులుగలవు అవివిశదపరచి తివేని కొంతవరకునమ్మకము గల్గును.

బృహ॥ ఆలాగేజెప్పెదవినుము అర్జునుండును ఫల్గుణుండును పార్థుండును కిరీటియు శ్వేతవాహనుండును భీభత్సుండును విజయుండును జిష్ణుండును సవ్యసాచియు ధనంజయుండును అను పదినామంబులునాకే గల్గియున్నవి.

ఉత్తరుడు॥ నీకీదశవిధనామంబులు గల్గినకారణం బేమి.

బృహ॥ సీ॥ ధరణీశ్వరుఁ గెల్చి - ధనమునార్జించిన
శౌర్యంబుచేధనం - జయుఁడనైతి
నీమంబుతో నేరి - నేనిబోరినగాని
జయముగాంచుటచేవి - జయుడనైతి
ఘనశుభ్రవాహన - కలితరథంబెక్కి
యనిసేయ శ్వేతవా - హనుఁడనైతి
తలమీఁదనింద్రుడి - త్తముకిరీటముదాల్ప
ధాటిమీరఁగ నేగి - కీటినైతి॥
తే॥ పగఱననిలోనబట్టిభీ - భత్సుసేయఁ
జూడభీభత్సుఁడనుపేరి - వాఁడనైతి

నరవిసవ్యాపసవ్యహ - స్తములయందు
శీవిగాండివముంచగాం - జీవి నైతి॥

సీ॥ ఆవదాతవర్ణుండ - నగుటచేనిలఁగల
జనులెల్లబొగడన - ర్జునుండ నైతి
నుత్తరఫల్గుణి - నొప్పుగాజన్మమె
త్తినకారణమునఫ - ల్గుణుఁడ నైతి
రణములోనాధర్మ - తనయుఁడాఁకెడిదేవ
బృందంబు గెల్చిజి - ష్ణుండ నైతి
దనరఁగాఁబృథయను - తల్లికిజన్మించి
యుండినకతనపా - ర్థుండ నైతి॥
తే॥ సురలునాతోడమాటాడ్ కన - హరిసహాయ
మగుచుఖాండవమేర్చిన - యపుడుమెచ్చి
హరవిరించులుగూడిన - నర్జునఁజూచి
కృష్ణుఁడనునామమింకొక్క - టిడిరివేడ్క॥

ఈపదకొండవ పేరుబెట్టుటయగాక కొన్ని యప్రతిహతశరంబు లిడిరి. వారియనుమతినింద్రాద్య మరులకేక శస్త్రాస్త్రంబులొసంగిరి గీర్వాణు లకోర్వరాని నివాతకవచులను పూర్వగీర్వాణుల మూఁడుకోట్లబలంబుల నింద్రస్యందనంబెక్కి యొక్కండన జయించితి నింకనొందరసురులఁబట్టి బరిమార్చితిని అందుకాబృందారకేశ్వరుండతి ప్రీతుండై కిరీటంబొసంగె దేవబృందంబు శంఖంబొసంగిరి అందుచేనాశంఖంబు దేవదత్తంబనా బరఁగుచున్నది.

కం॥ గంధర్వనాసుఁడొక్కఁడు
గాంధారీతనయుఁడైన - కౌరవనాథున్
బంధించఁగనేనదివిసి
గంధర్వులఁగెల్చియతనిఁ - గాచితివేడ్కన్॥

అమితబలవిక్రమాఢ్యుండనగు నేనునీకండగానుండవిసుమంతయైనభయంబు రానేరదు! నేనొక్కపెట్ట కురుబలంబునెల్ల జయించి కర్ణ గాంగేయ ద్రోణాశ్వత్థామ కృపాచార్యులాదిగాఁగలవారలు గనుగొనుచుండఁగ దుపులఁ గమ్మఁగించెదను. ఇంకనైన నామాటనమ్మకము లేదా.

ఉత్తరుఁడు॥ నేటికి నమ్మకముగల్గినది.

(అని వృక్షంబుదిగి చేతులుముకుళించినిల్చి)

తే॥ మొరలనాలించి బ్రోవుము - నరవరేణ్య
నిన్నెఱుంగక నిదివర - కన్నమాట
లెన్నొగలవవియెల్ల మీ - రెన్నకుఁడని
శరణు జేసితినయ్యన స్మరుణఁజూడు

బృహన్నలా. నిన్నుజయుండని యెఱింగిన చేతనే సకలపాపక్షయంబై కృతార్థుఁడనైతి మీశరీరమీ నపుంసకరూపమందు కొను కారణంబు దెలియబరచవలసినదని ప్రార్థించుచున్నాడ.

బృహ॥ ఉత్తరుఁడా మాయన్నగారగు ధర్మజుపంపున బ్రహ్మచర్య వర్తనకై పూర్వశాపవిహితమగు రూపమును ధరించి యొక్కసంవత్సరంబీ పేడితనంబుఁగొనుంటినదియు నిటమీఁదఁ నన్నుంటఁజాలదు.

ఉత్త॥ తే॥ ననుగృతార్థుఁజేయ - నాదెసఁ దయబెంపు
చేత నిజముదెలియఁ - జెప్పినాడ
వింకసురలకైన - జంకకుండుదునిట
యేను సేయు కార్య - మెద్దిగలదు॥

బృహ॥ ఉత్తరకుమారా నీవీవృక్షరాజం బెక్కి మదీయధనుర్బాణ కవచఖడ్గాద్యాయుధంబులుదీసి తక్కినవాని నెప్పటియట్ల కట్టగట్టి యందేయుంచిరమ్ము.

ఉత్తరుఁడు॥ ఇదిగో దెచ్చుచుంటిని (అని చెట్టెక్కి తెచ్చియిచ్చును)

బృహ॥ కం॥ నేనీశరాసనముచేఁ
బూనితిఁ గవచంబుదొడఁగి - పురుహూతుసుఁ స
న్మానించి యిడినమకుటము
నూనంబుగఁ బెట్టితిని గ - సుమునారూపుగ॥

దేవదత్తంబు చేతబూనితి. నపుంసకరూపంబువిడిచి పురుషరూపంబు దాల్చితి రథారోహణంబు జేసితి, సింహకేతనంబువిడిచి హనుమత్కేతనంబెత్తితి నికనీవు నొగలెక్కి జమ్మికి బ్రదక్షిణముగానరదమతి త్వరితగతి నడపిచితివేని కౌరవులఁ గెల్చి కదుపులమరల్చెద.

ఉత్తరుడు॥ అలాగే రథమును నడపెద.

(అర్జునుఁడు శంఖముబూరించుచున్నాడు)

(ఉత్తరుడు నొగలపై మూర్ఛ జెందుచున్నాడు)

అర్జు॥ ఉత్తరకుమారా లేలెమ్ము (అని లేవనీయుచు)

భూమింజయా నాదగు శంఖధ్వనికే సొమ్మసిల్లి నొగలపై బోలితివి ముందునీపురణారంగంబున శంఖభేరీ ఝాంకార ధనుష్టంకారసుభట హుంకారాదిధ్వనుల కెట్లోర్చిరథంబుగడపెదవోయని దలంచుచున్నాడ.

ఉత్తరుడు॥ (తెల్విదెచ్చుకొని) అర్జునా అట్టిధ్వనులొక లక్షయైనను నీ దేవదత్తధ్వనికి సరిగావు.

అర్జు॥ ఇదిగో రెండవసారి జాగ్రతగల్గియుండుము.

ఉత్తరుడు॥ సరే.

అర్జు॥ శంఖధ్వానము.

ఉత్తరుడు॥ కానిమ్ము.

అర్జు॥ ఇదిగో మూడవసారి వచ్చుచున్నది.

ఉత్తరుడు॥ రానిమ్ము.

అర్జు॥ ఉత్తరకుమారా కురువీరులు మన మొదవులదూరముగాఁ దగులుకొని పోవుచున్నారు రథంబువారిని గదుమనడపింపుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(భీష్మద్రోణ కృపాశ్వత్థామ దుర్యోధన దుశ్శాసన కర్ణవికర్ణాదులు) ప్రవేశము

భీష్మ॥ కౌరవులారా

కం॥ ముందర రాజును గోవుల
దందడిబెబ్బులికయపీఁద - దాఁటించుచుమీ
రందఱు వెనుకన్మసగా
సందడిలేకుండనడువ - సాగుండింకన్॥

దుర్యోధనా యవార్యబలవిక్రమోపేతుఁడగు సవ్యసాచి కయ్యంబున
కు మనలఁగదుమ వచ్చుచున్నాఁడు చూడుము.

దుర్యో॥ (చూచి) తాతగారూ అర్జునుఁడు అజ్ఞాతచర్యకొరంతమున
మెఱుంగమని తానే భూమి వెలువడియె, మనము మోహంబున గానమి
యొండె, నాయుఁగోభంబున వచ్చుట యొండెఁగావలయు. గావున నెక్కు
తక్కువ లెంతవరకుఁగలవో నిరూపింపుము.

భీష్మ॥ తే॥ కురుకులేశ్వర రెండువ - త్సరములైన
నొక్క నెలయధికంబుగాఁ - బిక్కటిల్లు
గాననవియెల్లలెక్కించ - గడచినట్టి
రోజకేవెళ్లిపోయెదు - ర్యోధనుండ॥

దుర్యో॥ మంచిది ఇప్పుడు మిగిలినదేమి అయితేనే సంగ్రామంబున నా
సవ్యసాచిం జయించి పసుధనంబును పరిగ్రహింపలేమా.

భీష్మ॥ (చిరునవ్వుతో) దుర్యోధనా పర్జన్యాదినిర్జరుల భంజించజాలిన
యర్జునునితో కజ్జమేల జేయఁబూనెదు వారికర్ధరాజ్యమొసంగి సంధి
జేసికొనుటమేలగు నామాటవినుము.

దుర్యో॥ పితామహా, అర్ధరాజ్యముగాదు సూదిమొనమోపినంత భూ
మియైనను పాండవులకు పంచిపెట్టను

భీష్మ॥ వారిభాగ మొసంగవేని సంగరోద్యోగంబు సేయఁబూనుము

మహో॥ సంగరము సేయదలంచుట సంతోషమేగదా.

(సోంతోఅర్జునుడు ధనుష్టంకారము జేసి)

అర్జు॥ ఉ॥ నీరతం బట్టి మీ తలం - దీసెద సైనికాళి గోవులన్
మేరగు నీపురంబుపాలి - మేరను దాటంగ నీయుమీరకూ
పారము లోనదాగిన న - భంబున కేగిన నాగలోకమున్
జేరిన గోవనీచురణ - సీమను నిల్వ మ భీరముండిన్

(ఉత్తరుని జూచి) ఉత్తరుండా యిది యే పెద్దమైన, యిందు కురురాజు గనుపించడు; యీ మైనకుడి వల భాగముగా మన రథము సాగదోలుము.

(పాంజూచి)

(భీష్మద్రోణకృపాచార్యులకు నమస్కారబాణంబులు వేయుచున్నాడు)

ఉత్తరుండా భీష్మద్రోణ కృపాచార్యులకు పాదకర్ణాంతములు సోకి సోకనములుగా, నమస్కారకుశల ప్రశ్నంబుకొరకు నాటేసి బాణములు వేసితి నిక మనరథము సైన్యంబునకు కుడి ప్రక్కగా గోవులున్న వెనకు నడపింపుము.

ఉత్తరుండు॥ అటులనే నడిపించెదను.

భీష్ము॥ ద్రోణాచార్యా. నీకును. నాకును కృపునకును కుశలప్రశ్నంబులుగా సోకిసోకకుండ రెండేసి బాణములు వేసి ఇతరులకు దుర్నిరీక్ష్యుండై కదుపులం గదియా వచ్చెడి యర్జునని జూడుము.

ఆ॥ అమితబలుని సజ్జ - నావనప్రియునరి
ధ్వాంతబంధు ప్ర - భాకరుండి
కాలమునకు గనుల గంటిమి వెనుకగా
వచ్చి రథము దోలంగ - బుచ్చిపోయె॥

విచారించగా నర్జునుండిమ్మొనం గలయంజూచి కౌరవేంద్రుని యిచట గానక నతనిం గనుంగొనవలయునను తలంపుతో మనలనతిక్రమించి పోవుచున్నాడు. ఇంతశక్తియుక్తి గల నరుండద్భుత విభుని ముట్టనేని మ

న ప్రయోజనంబెల్ల నిష్ఫలంబగుతదుపరి యీపశుధనంబుతో బనియేమి

ద్రోణు॥ పర్జన్యాది నిర్జరులకైన నలవిగాని యర్జునుని నిర్జించువాఁడి కౌరవులలో నెవ్వఁడుఁగలఁడు.

కర్ణు॥ నేనుండ లేదా.

అశ్వ॥ (నవ్వుచు) ఇన్ని నరపతి కార్యభారము నీపయిఁబెట్టుట చేత నీవతనికి మెప్పుగా నక్కవ్వడిస గెల్తునని కొవ్వి బల్కుచుంటివిగాని నీవేమి సేయఁగలవు. అయినను పెక్కుమాటలేల ప్రళయకాలానలు నిభంగివచ్చువివ్వచ్చుని జయించికురువిభుని యిష్టంబుదీర్చుము. అందుకు నీవుచాలవేని దీనికికారణకర్తయైన శకునినిగూడా యాలోచించుము.

కర్ణుడు కోపముతో } తే॥ ధారుణీస్థలిశూరుఁడు - భీరుపోల్కి
దురమునందున నిలువక - దొలఁగఁడెపుడు
వెఱచుమీబోంట్లకెల్ల నే - విభుఁడగుదు
వెఱతునే-భీపలుకకిట్టి - వెడగుమాట॥

నాపరాక్రమంబును నరుని పరాక్రమంబును నీవేచూచెదవు

అశ్వ॥ అవును నీవుముందు నడువుము.

కర్ణుడు॥ నడువక మీవలెవెనుకాడుదునా.

అశ్వ॥ నీవు నరునిబారింబడి వెనుకాడకుండుట మేము చూడక పోదుమా.

కర్ణు॥ కానిమ్ము    అనికర్ణుఁడు నిష్క్రమించును.

(అందరు క్రమముగా నిష్క్రమించిరి)

చతుర్థాంకము సంపూర్ణము.

## పంచమాంకము.

(అర్జునుఁడు ఉత్తరుఁడు ప్రవేశము)

అర్జు॥ ఉత్తరుడా, చంద్రప్రచండ కిరణమండితంబగు నిగ్గాండీవంబుచే గౌరవసైన్యంబు నెల్లకొల్లగాఁ గొట్టితి, నిదిగాక చిత్రాంగదప్రభృతి

కురుకుమారులఁ బోరాటమందు మాఱాడనీనైతి. సకలసైన్యంబులదై న్యంబు నొందించితి. గోవులమరలించితి. ఇక భీష్మద్రోణాది యోధా గ్రేసరులతో సంగరంబు సల్పఁదలంచితి గావున మనరథంబీ కనుపట్టు సేనకును పశుబృందంబునకును మధ్యగాఁదోలుము.

(అనిగోపకులఁజూచి)

క॥ గోపాలులారగోవుల
నీపట్టునఁ జెదరనీకు - డీశేకంబై
మీపాలముజొరగఁదోలితి
నేపగతులఁబట్టికొట్టు - కుంతయనాకున్॥

మీరాలామందలఁ దలగఁ దోలుకొనిపొండు.

(తెఱలో) దుర్యోధనునిసైన్యము.

తే॥ అక్కటామమ్ముబట్టిత్రు - ళ్లడఁగగొట్టి
యాలమందలమత్స్యభూ - పాలుగోప
బాలకులపాలు జేసెవి - వ్వచ్చుఁడిపుడు
మమ్మురక్షించరమ్మువే - గమ్మెకర్ణ

కర్ణు॥ యోచించి (బిగ్గరగా) ఏమీయీకలకల.

భటు॥ అర్జునుఁడు మనమొనఁజొచ్చి కొట్టిగోవులఁ దోలించుకొని పోవుచున్నాడు

కర్ణు॥ కోంపముతో } ఉ॥ ఎక్కడికేగెడాగనక - నిప్డైసనద్దుసిక్కుబాటుతో
జక్కగబక్కచేఁవలెఁ-జయ్యనవచ్చితివౌరనాదుచే
జిక్కితివింకనొంటరిగ - జచ్చెదకోలలనీయుఘోరని
యుక్కడఁగింతుఁజూడరమ - హోగ్రతనుద్గమమందఫల్గునా॥

నీవక్కడక్కడ బెక్కరీతులఁ బెక్కండ్రఁబట్టిఁ యుక్కడంచితివని విందునుగాని యింతదనుక నదినమ్మజాల పరిశయకాల ఫాలనేత్రునికిలా భీల జాలంబున కైనయగు ఘనశరపరంపరలు వింటనంధించి బఱపుచుంటి

నివిదప్పించుకొనుము.

(అసిశరములు వేయును అర్జునుఁడు మధ్యనేవాటి సంహరించి)

అర్జు॥ ఉ॥ ఓరీకర్ణుఁడ నేను లేనిమొదగ - ర్వోద్రేకముఁజూపంగనిం
పారఁగ లోకములో మదీయబలశౌ - ర్యవిక్రమఖ్యాతుల్ దగన్
లేరంచున్నవశిధిక్కరించుటనే - నేవింటిరారమ్మునన్
బోరంగెల్వఁగఁజాలితేనినిముషం - బున్నిల్వునాముందటన్॥

అదరుబెదరు దిగవిడిచిమొద దాలిమికూడుకొన కదనస్థలంబున
రెండు పదంబులొక్క ప్రదేశమందుంచిన స్థిరపోజిరియుం బొజిఁంచి
మరీకదలిపోమ్ము.

కర్ణు॥ అర్జునాతర్జనభర్జనలతో బవిరోల కదనస్థలంబున గట
తటంబులదరి వికటభ్రూకుటి నిటలస్థలంబునఁ జలింప పటుతరకోపాగ్ని
పెటపెట చిటచిటాయమానంబులై తటాలునదిక్తటంబులెల్లఁ బర్వ
బటాపంచలై మింటనంటుకొనునట్లు మంటలుమ్పతిలు ప్రచండకాండం
బుల సభండసస్థలియూఖండలాది దేవతాండంబు లాకసంబుననుండి
కన్నులపండువుగా జూచుచుండ నవఖండమండలాఖండలుండగు దుర్యో
ధనుండు నన్నుంగని మన్ననఁజేయ నిన్నుఁబట్టి బంధించి మట్టుబెట్టెద
నిక నాపరాక్రమము జూడుము,

అర్జు॥ కర్ణా మదసంకీర్ణా! కండకొవ్వుచే; గకనుమీఱి నీవేదండి
వాఁడవని రండమాటలాడుటాక దండితనమూ ఐననుకానిమ్ము. ఇక్కడ
వబృందం బమితానందంబుగాఁ జూచుచుండ మధ్యందిన మార్తాండ
మండలంబుకరణి మండిపడు శరకాండంబులచే నీగుండియలఁ జీల్చి
దండధరు మందిరంబునందు గాపురంబుండునట్లు జేసెదఁజూడుము.

కర్ణు॥ అర్జునా మానవిసర్జనా నీవ్రాండవుగాకున్న భార్యను
మానభంగంబుజేయుచో గుడ్లువెళ్లబెట్టి వట్టిదేబెరతి నూఁక కన్ను
లార్పకజూచుచుండెదవా.

అర్జు॥ కోపముతో { ఉ॥ మిక్కిలిప్రల్లదంబులని- మేలముకొక్క విధంబుబల్కి దాతక్కక ద్రౌపదీసతిని- దర్పమెలర్పఁగమానహానిమీ
రెక్కుడధర్మమార్గమిది- యేననియెంచకఁజేయునాడు నే
మక్కడయున్నమాటవెను- కాడకనూరకయుంటిమోటమిన్

లేకున్న మద్భుజాదండ మండితగాండీవ విముక్త ప్రచండ కాండంబులచే గురుకుమారాది రాజమండలంబెల్ల కండలుకండలుగావించి గండుకుక్కల కాహారంబుగా నాఁడే వేయక నూరకుందుదునా.

కర్ణు॥ అర్జునా అంతమగతనమున్న మీ భాగమునుదిగవిడిచిఅడవుల కేఁగి పడరానియిడుమలెల్లఁబడి బడుగులై కడకుముదిసిన తోండలవలె ముక్కునూవిరి బెట్టుకొనితిరుగ నేమొగముతో రాదలంపుబుట్టినది.

అర్జు॥ క్షాత్రధర్మమునుబట్టి.

కర్ణు॥ క్షాత్రధర్మమన నెట్టిదోనీకు దెలియునా.

అర్జు॥ రండా నీవు దండిమగండనని ఘోషయాత్రయందు క్షాత్రధర్మంబు బూనియేగాఁబోలు. దుర్యోధనుని శౌర్యధైర్యస్థైర్య గాంభీర్య చాతుర్యౌదార్యములగు గంధర్వులపాలుజేసి గుప్పునరథంబునుమికి తప్పించుకొని పోయి ప్రాణంబులు నిల్పుకొన్నది భీ షండానీవంటి విశ్వాసహీనుండీలోకంబునం దింకెవ్వఁడుగలఁడు.

కర్ణు॥ అర్జునా షండుని లక్షణంబులువిను నీవలె నెడవాసినరాజ్యంబుపై నాసించుటయు కడుగాసికోర్చుటయు వనవాసంబు నెఱవేర్చుటయు విరాటునింటఁబొట్టకూటికైకుదిరి యాటపాటల భినయంబులు నేర్పుటకుగా నపుంసక రూపమెత్తుటయు నీ మొదలగు నీచములకొడిగట్టగు రాచధర్మవేత్తవు నీవెల్లప్పుడును షండుఁడవుగాక గండుమానిసివని యెవ్వరను కొందురు.

అర్జు॥ తుంటరీ కొంటెయగు సుయోధనుని వెంటబెట్టుకొని బంటురీతి ప్రధనోద్యోగమునల్పసమయముగని తగుదునని వచ్చితివి యిప్పుడేసిద

రామండలంబు భేదిల్ల ప్రచండమద్భుజాదండ మండితగాండీవం బెక్కిడి టాం టాం యనిటంకారధ్వని దిక్తటంబుల యందుమాఱు మ్రోయశైర్య స్థైర్యంబులు మెఱయ బిడుగులవంటి వడిగలవిశిఖంబులచే నీమగతనం బగడు బెగడునట్లుజేసి పగవారు పరమానందంబుచే పకపకనగవునట్లు జేయుచున్న నేనుపార్థుండనా పృథాసూనుండనై నీతో వృథా ప్రసంగంబులాడఁదగదు నాకరలాఘవంబుజూడు.

(అనిశరములచే గొట్టగా కర్ణుఁడు పాఱిపోవుచున్నాఁడు)

అర్జు॥ (జూచి) చ॥ నిలునిలుశౌర్యహీనయని- కట్టనవైరియువక్రవిక్రమా
ఘ్న్యలఁగడుఁదాకిపోరికిటు- లోడిభయంబుపడిసంగరస్థలిం
దొలఁగగఁజేతులంగలవి- తూపులుగా వెమతెప్ప గాజులా
కలగకరిమ్ము గెల్చిజయ- కారిపిగమ్ముయశంబుపమ్మగ ॥

మానవంతులోక క్షణకాలంబులో క్షీణించు ప్రాణంబులకాసించి భూమి పాలగుఁబొందికొఱకు నీవలె మానహీనతకియ్యకొనరు. నామాటవిని పసరముకీర్తి బాఱిపోకవైపులఁ గదిసిపోరి మగిమునందు జయలక్ష్మింబొందుము. కర్ణాయుద్ధంబునకురమ్ము, (అని వెంబడించ కర్ణుఁడు పాఱిపోవును)

తే॥ ఉత్తరుఁడ కర్ణుఁడీవుడుఁబల్- తత్తరమున
సమరతలమునఁబోరాడఁ- జాలలేక
బాణములనేలఁబడవైచి- భయముచేత
తలనువిరబోసికొనిపాఱె- దైన్యవృత్తి॥

సకలకురుకుమారుల సకలవిద్యయందతి నిపుణులగునట్లుజేసిన దివ్యాస్త్రకోవిదుఁడగు ద్రోణాచార్యులకెదురుగా మనరథంబుసాగదోలుము.

ఉత్తరుడు॥ ఇందు ద్రోణుండెవ్వఁడు

అర్జు॥ ఎఱ్ఱనిగుఱ్ఱంబులఁగట్టిన తేరునెక్కి మనకుప్రక్కగానున్న వేదనీతిశాస్త్రకోవిదుండగు నమ్మహాత్ముండే ద్రోణుండు.

ఉత్తరుడు॥ మనయరదంబు ప్రక్కకేదోలెద.

పటిమనిం[దాగ్ని నాయువు-ల్వరుణుఁడొసఁగు
నంబకంబుల నేసితి-నతిరయముగ
నీకరలాఘవంబుచేతనీశరపరంపరల నుఱుమాడుము.

అర్జు॥ ద్రోణాచార్యా మీనారాచంబులెల్ల దదీయనారాచంబులచేనీర సంబుగావించితి నికనాకరలాఘవశరలాఘవంబులచేనీసైన్యంబునెల్ల నవిద్రైన్యంబునొందించి పటుతరనిశాతోజ్వలదుర్నివారవిలసద్బాణజాలంబుచే మీతురగస్యందనధ్వజంబులఁద్రెంచి మీమెుడలిసోయగంబెల్ల జల్లెడతూట్లరీతివల్లె వల్లెగాఁ గొట్టుచున్న నేను మీకుశిష్యుండనా.

(అని ద్రోణునిరథతురగధ్వజాదులఁ గొట్టివేసి ఉత్తరునుజూచి)

తే॥ ఉత్తరకుమారయాచార్యుఁ-డుక్కుదక్కి-
నిలచెరాసిలపోలిక-నెమ్మొగనర
యిమ్మహాత్ము నివిడియర-దమ్ము[నాఁటి
పైకిఁబఱపుము వేవేగ-భయముదలఁగ

ఉత్తరుడు ఆలాగేతోలెద

(అశ్వత్థామచూచి)

మత్తకోకిల॥ ఓధనంజయునాదుబాహుబ-లోన్నతింబవరంబుసం
నీదు దేహముబాణవహ్నికి-నేనిటుంబరమాహుతిం
యోధులెల్లరుజూచిసంతస-మొందగానొసరించినీ
[క్రోధమెల్లనడంతుఁగౌరవ-కోటిమేటిచెలంగగ॥

మద్గురువరుండతివమో వృద్ధగుటచేయుద్ధరంగమందు ముగ్ధుఁపోల్కిగ నుప్పై నతనిమాటు నేనరుదెంచితి నికనాతోసంగరోద్యోగంబుసేయురమ్మా॥

అర్జు॥ ఇదిగో శరవర్షముగురిపించెద

అశ్వ॥ నీశరవర్షముచునుమనేహరించితిని-

(అనికొన్నిశరములువేయును)

(అశ్వత్థామశరంబులనడుమనే హరించి)

అర్జు॥ మ॥ ఇదిగో వైరము దీర్పఁ గోరఁగలఁచినే-నీపట్టున న్నేవలం
గదియంగొట్టితి దారుణాస్త్రములయు-గ్రవ్రాతముం సూతునిన్
జదియన్ద్రొక్కితిఁ దీవ్రబాణముల నీ-చాపంబుఁ గాఁ జేసితిన్
గదసంబందుననిల్పి పోరజయమం-దన్వచ్చు ద్రోణాత్మజా॥

(అని కొన్ని బాణములుగుప్పి ఉత్తరునిఁ జూచి)

అర్జు॥ తే॥ వికటభూపాలతనయుయూ-గురునిసుతుని
దైనతూణీరములు తీయ-బాణములుగ
నన్యుకీతనివిడిమున స్యందనంబు
పరకృపాచార్యుపైకి వే-బఱవుమింక॥

(తెఱలో)

కృపుండుచూచి)

కం॥ సూతాఘనసుగుణాకర
నేతా మనస్యందనంబు-నీపీఁచట్లన్
ఖ్యాతిగనస్థిరరథమున
కాతతముగఁగదియఁ దోలు-మానస్థిరతన్।

సూతు॥ చిత్తము. (అనిరథమును దోలుచున్నాఁడు)

కృపా॥ శా॥ ఓహో వచ్చితివర్జునా నిలుమిమా-యుద్ధస్థలింగల్గుమా
వ్యూహంబెల్ల విచిత్రమందశరముల్-పుంఖానుపుంఖంబుగా
బాహాటోపమెలర్పఁ బూనిధరణీ-పాలుండు హర్షించను
త్సాహస్ఫూర్తిని నిన్ జయించి విజయో-త్సాహంబులార్జించెద
ఇదిగో నాకరలాఘనంబుఁజూడు.

అర్జు॥ కృపాచార్యా గురుశితశరపరంపర లెడ తెఱపిలేక గుప్పుచుంటి
ని తప్పించుకొనిపొమ్ము.

కృపా॥ కవ్వడీ నీశరజాలంబుల మధ్యనే మాయంబు జేసితి నిదియటుం
డ రవిగ్రహంబును నిగ్రహింపదలఁచుడు రాహుగ్రహంబుచాడ్పునవచ్చు

దుర్యో॥ కం॥ హారునిదురమందు గెల్చిన
పరబలుఁడనటంచుఁగదియ- వచ్చితివటరా
అర్జు॥ గురుకృపభీష్మాదులుమఱి
పరుగిడిరదిగనుమునాడు- బలదర్పమునన్॥

దుర్యోధనా నాకన్న నెక్కుడు శౌర్యవంతుం డెవ్వండని కడుసహసంబుతో నానావాదోద్యోగంబున కోపాటింపకవచ్చితివా మేలు మేలు మాకు నీవువైశసంబాదిగాఁ జేసిన యపరాధంబు లనేకంబులుండెనవి నీవుమఱచితో మేముమరచెదమా. విను.

సీ॥ విషమన్నమందుఁగ- ల్పించి పెట్టించితి
వౌభీమసేనుని- యందుదయను
మఱిసర్పములచేతఁ- గఱపించితివిగంగ
మడువులఁద్రోయించి- తడవుచేత
లక్కయిండ్లనుగట్టి- చక్కగాఁగాల్పించి
తభిచారకర్మంబు- లగణితముగఁ
జేయించిమాయపా- చికలను దెప్పించి
మాయజూదమునసా- మ్రాజ్యమంత॥
తే॥ యపహరించితివదిఁగాక- ద్రుపదసుతను
మానభంగంబుగావించి- కానలకును
బంపితివియిట్టిక్షుద్రమౌ- పనులు జేయఁ
జేతగానట్లు మేమున్న- రీతివినుమీ॥

ఓరీ మేమా ధర్మసుతుని శాసనం బతిక్రమించజాలక నూరకున్న మీ చేయు క్రూరకార్యము లప్పటికిచెల్లెగాని మీఁదఁజెల్లబోవు నా. కులహీనాఁ మదీయశరప్రకరంబుల చవిజూపుచుంటిని అవి శకునిమాయాద్యూతంబులో మమ్ముగెల్చి నీకిచ్చినరాజ్యంబు చవినిమించునో తగ్గించునో యా హెచ్చుతగ్గులు బాగుగా విచారింపుము.

నొక్కమాఱె ననుడిగింప వృక్కదక్క
వచ్చుచుండిరి యోధులు హెచ్చుమీఱి॥

అర్జు॥ ఉత్తరకుమారా నేనుగల్గ నీవు వెనుకాడవలదు కొంచెముసేపు దాహంబున కోర్చి నిలిచితివేని కౌరవులనెల్ల నొక్కపెట్ట భంగపెట్టి వెల్లపను టు ఈక్షణకాలంబులోఁ జిక్కబెట్టుకొని పోవఁగలము గాని విచారించుము (అని యోధులఁజూచి) యోధులారా సమ్మోహనాస్త్రప్రయోగము జేసెదని

(అందఱు మూర్ఛబోవుచున్నారు)

తే॥ భూపనందన నా సమ్మోహనాస్త్ర
మునకు నీకౌరవాగ్రణి ముఖ్యమైన
వుడము లెల్లఁ బుడమిపైఁ బడిరి కనులఁ
జూడు భీష్మాది యోధులఁ జూడుమనఘ॥

ఉత్తరుడు॥ అర్జునా కన్నులారఁ జూచి సంతోషించితిని.

అర్జు॥ కౌరవులఁ బోరాటమందు గెల్చి వారి వస్త్రంబుల యందలి విచిత్రంబగు వాటినెల్ల బొమ్మపొత్తికలకు దెమ్మని యుత్తర కోరెఁగదా.

ఉత్తరుడు॥ అవును.

అర్జు॥ నీవిపుడు రథముడిగ్గిపొమ్ము.

ఉత్తరుడు॥ పోయి నేజేయునది యేమిటి.

అర్జు॥ ఆ॥ నల్లపాగవారు నరపతిగురుసుతుల్
పచ్చపాగపొద్దు పట్టిదరియు
తెల్లపాగవారు తేటతెల్లంబుగా
గురుఁడు కృపుడు గనుము గుఱుతులివియ॥

దు తిరిగ ర్తనాథుని యుద్ధమందు దుర్లక్షంచబోయిన మల్లులలోనాటుపో
టుదాఁకనివారిఁ గొందరపరియాణంబుజేసి ముందుబంపితివేని నేనువారి వెం
టనేతగువారిఁగూర్చుకొని తఱలెదను.

కంక భ॥ (చిఱునవ్వుతో)

ఉ॥ మానవనాథ మీరిటుస-మంచితచిత్తముగ ల్గినీకుడ
మ్మానితుఁడైనయుత్తరకు-మారుఁడుసారధిగాబృహన్నలం
బూనుటచేనతండతిమ-నోద్ధృతతండగనిజ్జరాదులం
మానకగెల్చివచ్చునను-మాటవెఱపేటికినీకుభూపతీ॥

దక్షిణదిశఁగల పశుధనంబునుసుశర్మయొంతగానంగ్రహించెనోయుత్త
రదిశఁగలయవికూడా కురుపతియంతగానే సంగ్రహించగలడు నామాటన
మ్మి మీమనంబునంగల వ్యసనంబునువిసర్జించి నెమ్మదిగానుండుము.

[గోపాలుఁడు ప్రవేశము]

గోపా॥ రాజేంద్రా వందనములు.

విరా॥ శుభమగుగాక. గోపాలకానీవిచ్చటికి వచ్చినకార్యమెయ్యది.

గోపా॥ మనయుత్తరకుమారుండక్కురుకుమారులమాఱ్కొని పోరా
టమందు తెగఁబోరివారినెల్లరఁ జయించి పశుధనంబునుదోలుకొని సారధి
సహితముగా విజయముచేయుచున్నారు. నేనుదేవరవారికీశుభవార్తవిన్న
వింపవచ్చితిని.

విరట॥ సంతోషము సంతోషము (అనిసుగుణమణినిజూచి) సుగుణ
మణీ కులనాపకులసేకులు గల్గుటకన్న సుపుత్రకఃకులదీపకః యనుప్రమా
ణంబుగా మనయుత్తరునివంటి యుత్తమక్షత్రియకుమారుండొక్కఁడేచా
లు మీఁదనాతని విజయంబిప్పురంబున సాటింపనియమింపుము.

సుగు॥ శేవకాఁడ ఉత్తరకుమారుని విజయంబిప్పురంబున సాటింపుచేయించుము.

శేవ॥ అయ్యాచిత్తము. [నిష్క్రమించును]

(తెఱలో పుల్లడు సాటించుట)

ఓహో పౌరులారా మీరందఱు వినందగు గడచినరోజున భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణశకునిబాహ్లీకుఁడాది గాఁగల యోధవీరులెల్లరునిమ్మత్స్యపురంబునంగల గోవులఁజూఱఁబట్ట వారినెల్ల మనయుత్తరకుమారుండతి శౌర్యోద్రేకుండై సంగ్రామమందు జయించి కురువీరోత్తముల శిరోంబరంబులు దెచ్చినాడోహో.

విరటు॥ కంకుభట్టా యుత్తరకుమారుండిందువచ్చువరకుమనము చేయునదియేమి కొంతదనుక ప్రొద్దుబుచ్చుకొనుటకై జూదమాడుకొందమా,

కంక॥ రాజేంద్రా!

తే॥ జూదమాడుటచేధర్మ-సూతిరాజ్య
హీనుఁడై కానలకుఁబోయెఁ- గానజూద
మాడుటెంతటివారికి- నైనదగదు
గానిమీమాటజవదాఁట-లేనురాజ॥

మీమనోభీష్టము నేనేలదొలగించవలయును. ఆలాగేయాడుదము నెత్తమ్ము పలకఁదెప్పించుము.

విరటు॥ శేవకా. నీవీక్షణంబబోయి పగడసాలఁదెమ్మని సైరంధ్రికిజెప్పిరమ్ము.

శేవ॥ అయ్యా ఆలాగే.

(నిష్క్రమించి సైరంధ్రితో ప్రవేశించుట)

సైరఁ॥ మేదినీశ్వరా మీయాజ్ఞప్రకారము పగడసాలఁదెచ్చితిని.

విర॥ ఏదిపగడసాల.

సైరం॥ ఇదిగో [అనిచేతికిచ్చును]

కంకబట్టా నెత్తంబొకపలకయాడనుద్యోగింపుము.

కంక॥ అలాగే. [ఇద్దరుకూర్చుని పాచికలువేయుచున్నారు]

విర॥ బ్రాహ్మణోత్తమా నాకు దుగ దచ్చి బార యిత్తిగబడినది.

కంక॥ ఇత్తిగబడ నేమిలాభము. నీకునునాకును సరిపందెమేమైనది.

విర॥సరిపందెమెల్లినది నాకుసతబడ్డది నా కాయలన్నియుత్తోడై యొక్కచోటికేవచ్చినవి.

కంక॥ నీగూడినకాయలెల్ల నేనుకొట్టివేసితి.

విర॥ నీవుకొట్టినకాయలెల్లఁ దిరుగఁబెట్టితి నేనువాటినిప్పుడే బండ్లఁజొసెద.

కంకు॥ రాజేంద్రా ఈపందెంబులో నానేర్పుచేతనిన్గెలిచితిని.

విర॥ కం॥ పోరాటమందుఁగౌరవ
వీరులనోడించి ధేనువితతినిమళ్లీ
యూరికిఁదెచ్చిననాదుకు
మారునిదేనేర్పుగాని- మఱియొక్కరిదే॥

జూదంబులో గెల్చిన నీదియొక నేర్పరితనమా.

కంకు॥ రాజేంద్రా భీష్మద్రోణకృపాశ్వత్థామదుర్యోధన దుశ్శాసన కర్ణవికర్ణ శకుని బాహ్లీకుఁడాదిగాఁగల యోధుల నెల్లను త్తరుండేజయించివచ్చెనని నమ్మజాలను.

విర॥ మరియెవ్వరు జయించిరి.

కంకు॥ ఆకురుసేనాసముద్రమింకఁజేసినది బృహన్నలగానియుత్తరుఁడు కాడు.

విర॥ తే॥ ఉత్తరుఁడు గెల్చెననునది- యుత్తదనిన
మాటకేనోర్చియుంటిమో- మాటనుంచి
యింకమీఁదటనిట్లాడి- తేనిసేన
హించంగాఁజాలనినుగార- వించనుమ్ము॥

కంకు॥ రాజేంద్రా నీవెన్ని యన్న నేమి నిశ్చయముగా గౌరవులఁజయించినది బృహన్నలగాని యుత్తరుఁడుగాడు.

విరటు॥ (కోపముతో)

తే॥ ఎంతజెప్పినవినవైతి- లింకనాబృ
హన్నలను వేవిధంబుల- సన్నుతించు
చున్న వాఁడవుని న్నెన్ని- యన్న గాని
పాపమెట్టిదౌలగుల దు- బాపనయ్య॥

కంకు॥ నీవేమిచెప్పితివి నేనేమివిననైతిని.

విర॥ ఇకనైనానోరుమూసెదవాలేదా.

కంకు॥ నేనునిజమాడితిని నిందుతప్పేమిటి.

విర॥ కౌరవులఁ జయించినది యుత్తరుఁడుకాఁడా.

కంకు॥ ఉత్తరుఁడుకాడు.

విర॥ బృహన్నలయేనా.

కంకు॥ అవును.

విర॥ ఇంతయోర్వలేమివని యెఱుంగక నిన్నింతదనుక నెంతోగౌర వముగానుంచితి. నికనీ మొగముజూడదగదు.

కంకు॥ ఏకారణముచేత.

విరటు॥ కారణమేమిటి నాకుమారుని విజయంబువినసహింపక వదరు చుంటివి. ఛీ.

(అనిపగడసాల పాచిక చేతనెత్తివై చుచున్నాడు)

కంకు॥ సైరంధ్రీ యివ్విరాటుండు పాచికచే యెత్తివైచుట చూచితివా.

(సైరంధ్రి కంకునిమొగమువీక్షించి కోపముతోవిరటునిదెసచూచు)

సీ॥ ఈవిరటుండుమి- మ్మందఱుచూడంగఁ
బాచికచేయెత్తి- వైచెనకట
ఇందాఁకఁగ్రైనసీ- కిదితగదని మత్స్య
పతితోడనోరెత్తి- పల్కరకట
కళగుల్కునుదుటర- క్తప్రవాహంబెంతొ
పిల్లకాలువరీతి- వెడలెనకట
పొట్టకూటికిమీర- లిట్టిభూపతిఁజేరి
సేవకవృత్తిని- జేసిరకట॥

తే॥ పట్టెడన్నంబుమీకిటఁ- బెట్టలేక
నట్టిపాచికచేఁబట్టి- కొట్టెనకట
ఖ్యాతిగలవారుహీనుల- చేతనిట్లు
కొట్లబడుమనివిధివ్రాసెఁ- గుమతినకట॥

కంకు॥ సైరంధ్రీ నీవంతగాఁజింతించదగదు. పూర్వజన్మకర్మ దప్పించుకొ ననేరికిశక్యమగు అదియటుండ నీరక్తబిందువు లివ్వసుంధరపైఁ బడకుండ జేయుము.

(సైరంధ్రి దనయుత్తరీయంబుతో రక్తమును దుడుచుచున్నది.)

విరటు॥ (ఆశ్చర్యముతో) సైరంధ్రీనీవింతకుమున్ను పరపురుషులనం టనని పల్కితివిగదా. యిప్పుడీకంకునిముట్టి నీయుత్తరీయంబుచే ప్రవహించురక్తంబు నేలనొత్తుచుంటివి.

సైరం॥ ఉ॥ ఈతఁడుసత్యవంతుఁడవ- నీశ్వరవందితుఁడాకతంబగా
కీతనిరక్తబిందుతతు- లెన్నివసుంధరపైఁదొరంగునో
ఖ్యాతిగనన్నివత్సరము- లయ్యవనీస్థలమంఁదువర్షముల్
జాతమటన్న నుండవను- చున్నిటుజేసితినయ్య భూపతీ॥

విర॥ మాకుపకారము జేయఁబూని యిట్లుజేయుచుంటివేమి ఐతేగాని మంత్రి.

(శేవకుడు ప్రవేశము)

శేవ॥ రాజేంద్రావందనములు.

విరటు॥ శుభమగుగాక.

శేవ॥మనయుత్తరకుమారుఁడుబృహన్నలయురాజమందిరద్వారంబుకడకు ప్రవేశించియుండిరి.

విరటు॥ శేవకా వారినిద్దరిఁ దోడ్కొనిరమ్ము.

శేవ॥ అయ్యాచిత్తము.

కంకు॥ (రహస్యముగా) శేవకా నానుదుటియందొల్కు నెత్తురును బృహన్నలచూచెనేని నన్నుగారవించి యీవిరటుని పరిభవము జేయును గావున నదిలెస్సగాఁదుడుచుకొనువరకు బృహన్నలనిందురానీక నుత్తరుని యొక్కని వచ్చునట్లు జేయుము.

(శేవకుఁడు నిష్క్రమించుచు)

(ఉత్తరుడు ప్రవేశము)

ఉత్తరు॥ మత్స్యభూమండలభారకర్తా వందనములు.

విరటు॥ పుత్రరత్నమా జయమగుగాక.

ఉత్తరు॥ (కంకునిజూచి) స్వామీ మీనుదుటియందు గండిబడిరక్తము దొరగుచున్న కారణంబేమి.

కంకు॥ మీతండ్రిచే దెలిసికొనుము.

ఉత్తరు॥ జనకా యిమ్మహాత్ముని నుదుటనెత్తురొల్కుచున్న దేమి.

విరటు॥ ఆ॥ వె॥ పనునీజయంబు- నెక్కుడువర్ణింపఁ
దానుబేడిఁబొగడెఁ- దానఁగోప
మూనిచేతసారె- నూనిపైచినగండి
బడియునెత్తురొల్కు- నెడలుచుండె॥

ఉత్తరు॥ [భయకంపంబుతో] తండ్రీ మనకు తల్లియును దండ్రియును దాతయును దైవమును అగునిమ్మహాత్మునియెల్లవిధంబులఁ బూజించి యితని కృపారసంబుబడయకున్న నాయువును సిరియును బ్రతుకును గలుగ బోవునా యీసత్యసంధుని గొట్టినందుకిప్పుడు తగురీతిఁ బ్రార్థించి యితని మనంబునంగల కలకదీర్చవలయును సుమీ.

విరటు॥ ఆలాగే ప్రార్థనజేయుము.

ఉత్తరు॥ (చేతులుజోడించినిల్చి)

ఉ॥ మీరెటులన్నగాని ప్రియ- మిత్రునిగామిముజూడలేకనీ
తీరునదప్పుజేసె గుమ- తిమ్మనినాయకమీమహాత్మ్యముల్
ధీరతఁగాంచలేనిగతు- తెంపిరియైనవిరాటునింసదా

చారమునిల్పిబ్రోవుఁడని।సన్నుతిఁజేతుగృపన్వహించుమా॥

మీ రింత వారలని దెలియక మాతండ్రి చేసినయపరాధంబులెల్ల క్షమించండి.

కంకు॥ ఉత్తరకుమారా నాకుమీాపైనలుకలేదు. కాలమహిమచే నిట్లుజరిగినది. నీవంతగాఁబశ్చాత్తాపమందవలదు.

ఉత్తరు॥ మీామనశ్శుద్ధివింతయని పొగడనేరికి తరమ్మగు.

కంకు॥ ఉత్తరుఁడా మమ్మంతగాఁ బొగడవలదు ఇకచాలింపుము.

విరటు॥ కుమారా నీవకుర్రుసేనను జయించివచ్చిన తెరంగుజెప్పుము

ఉత్త॥ సీ॥ వినుముదెల్పెదమీాకు- విశదంబుగానింక
కురుబలంబేతెంచి- గోధనంబుఁ
గొల్లబట్టిరటంచు- గోపకుండొగిఁదెల్ప
వినినేనుధైర్యవి- వేకినగుచు
నాబృహన్నలసూతుఁ- డైనరథంబెక్కి-
యుద్ధంబునకుఁబోవు- చున్నవేళ
గోగణంబులఁబట్టు- కొనిపోవుగాంగేయ
గురుకృపాశ్వత్థామ- కురువిభులును॥

తే॥ దుస్ససేనుండుకర్ణుండు- దుర్ముఖుండు
మొదలగాఁగలయోధుల- మొనలఁగాంచి
కడుభయంబందిరథముపై - నిలువలేక
వడకుచునుపాఱిపురిఁజేర- వచ్చుతఱిని॥

తండ్రీ దేవాంశసంభూతుండగునొక్కదివ్యపురుషుండరుదెంచి యోడకుమని నన్నునిల్పి యభయదానంబొసంగి పిదపనన్ను సారధిగాఁజేసికొని తారథికుండై కరపద్మంబున ఘనమగు కార్ముకంబొక్కటిపూని కౌరవుల

నెల్లజయించి పశుబృందంబునుమరల్చి విరాళించినిల్చిన నదిగనివెఱఁగంది కురువిభుండు నిజపురంబునకు జేరె నియ్యుద్ధమందమ్మహానుభావునిచే జయమంది పశువులతో మత్స్యపురి జేరితిఁ గాని నాప్రజ్ఞయిసుమంతయైనలేదు

విరటు॥ [ఆశ్చర్యంబుతో] నిజముగానా

ఉత్తరుడు॥ నిశ్చయముగానే.

విర॥ కుమారా అమ్మహాత్ముం డెవ్వడో నాకనులఁజూడ నోమనైతిఁ గదా.

ఉత్తరుడు॥ మనకు దర్శనంబీయదలఁచియే యున్నవాఁడు.
విరటు॥ మనకు దర్శనంబిచ్చునా.
ఉత్తరుడు॥ ఆ- సందేహము లేకుండా.
విరటు॥ కంకభట్టా మీారలుగృహంబునకు విచ్చేయుఁడు-

(సైరంధ్రికంకభట్టు నిష్క్రమించును.)

విర॥ కుమారా- మనమంతఃపురంబున కరుగుదమురమ్ము. (ఇద్దరుని ష్క్రమించిరి)

(ఉత్తరబృహన్నల ప్రవేశము)

బృ॥ తే॥ ఉత్తరామేముకురుకుమా-రోత్తములను
గెలచిగోవులమరలింపఁ-దలఁచిజనెడి
యిమ్మ గనిబొమ్మపాత్రికల్-దెమ్మటంచు
బల్కితౌ కొమ్మయివిగో-చేపట్టవమ్మ॥

కౌరవోత్తముల శిరోంబరంబులు దెచ్చితిని యివిగో గైకొమ్ము.

ఉత్తర॥ [అవిఅందుకొని] మీారుగురువులు కరుణాకరులు నాకుదయ

డితోసమానులుగావుననాకోరిక నెఱవేర్చినారు. వేఱొకరిట్లు శేయగలరా.

బృహ॥ అవునవును.

[ఇరువురు నిష్క్రమించిరి]

షష్టాంకము సంపూర్ణము.

## సప్తమాంకము.

(పంచపాండవులు ద్రౌపది నిజరూపములతో విరటుని సింహాసనమెక్కుచున్నారు.)

[వస్త్రమును మొగమునకడ్డముంచుకొని]

ధర్మరాజు॥ కం॥ అనుజన్ములార వేడుక
మనమందఱుమిివ్విరాటు-మందిరమునందుఁ
ఘనగూఢచర్యవత్సర
మనువుగనెఱవేర్చుకొంటి-మాహరికృపచేఁ॥

ధనంజయా యుత్తరగోగ్రహణంబున కౌరవోత్తముల జయించినతెరంగు దేటపరచుము.

అర్జు॥ సీసం॥ దుర్యోధనుఁడుదాన-వార్యబలంబుతో
వచ్చిగోగణమును-బట్టుకొన్న
వృత్తాంతమునుగోప-వితతిచేయుత్తరుం
డాలించిసారధి-నరసియరసి
వేసారికడకున-న్బిలిపించిసారధ్య
మొగిసేయుమనిఘనం-బొప్పవేడ
నందుకేనొడఁబడి-యరదంబునొగలెక్కి-
గోవులుచన్నట్టి-త్రోవఁబట్టి॥

తే॥ రథముఁ నడుపుచునుండగా-రవులఁగాంచి
యుత్తరుఁడరదముడిగ్గి-త త్తరమున
పాఱఁజూపంగ నాతనిఁ-బట్టి తెచ్చి
నొగలపై బెట్టిరధికుఁడ-నగుచు నేను॥

ఆయుత్తరుని సారథిగాఁ జేసికొని శమీవృక్షనిక్షిప్తాయుధంబులు గైకొని, కపిధ్వజదేవదత్తకిరీట, గాండీవాది దివ్యపరికరంబులుదాల్చి నిజరూపంబు ధరించి కౌరవసేనాకూపారంబుఁ గలఁగఁజేసి భీష్మద్రోణకృపాశ్వత్థాములఁబట్టి జెగ్గడిలఁగొట్టి పశుగణంబు మరల్చి మరలపూర్వరూపంబు ధరించి సారథినై పురప్రవేశంబైతిని ఇదిమదీయ సంగరవిధంబుఁ విరాటుదక్షిణగోగ్రహణంబు గావించిన తెఱంగు శలవీయండి.

ధర్మ॥ సీసం॥ ఆత్రిగర్తాధీశుఁ-డతిబలహితుఁడై
పశువులఁబట్టిగో-పకులఁగొట్ట
నదిగోపకుల చేతనమ్మత్స్యపతివిని
సకలసేనలఁగూడి సమరమునకు
వెడలుటగని నేను భీమనకులసహ
దేవులతోఁగూడి యావిరాటు
నకుసహాయుండనై ప్రకటితగతిఁజని
యరిసైన్యములనెల్ల నడలఁగొట్టి॥

ఆ॥ వె॥ యాసుశర్మ చేతి-కఁదిన విరటుని
బంధనంబులూడ్చి-పశుధనంబు
మరలఁజేసిపురికి-మత్స్యేశుతోవచ్చి
యున్నవారమిదియ యుద్ధవిధము॥

( అర్జునుండు ధర్మరాజు వదనంబుజూచి )

అర్జు॥ భీమసేనా మద్భుజబలపరాక్రమంబువిన సహింపకనాయేమి

మనయన్నగారొక వస్త్రంబును ముఖంబుపైఁ గప్పుకొనియున్నారు.

భీము॥ కారణంబేమో తెలియదు.

ధర్మ॥ సీ॥ మత్స్యభూపతినేను-మరిజూదమాడెడు
సమయమందునమాట-సామితగను
దనకుమారుఁడెకురు-తతినెల్లఁబడఁగొట్టి
యావులమరలించె-నంచుబొగడ
నేనదివినగన-హింపకథార్తరా
ష్ట్రులనాబృహన్నల-సుడివడంగఁ
గొట్టినాడనిబాయి-గుద్ధకోపముచేవి
రాటుఁడుపాచిక-తోటిబొడిచె

తే॥ అందుచేఫాలభాగము-నందుగండి
బడిరయంబుగరక్తంబు-వఱదయయ్యె
గానవస్త్రంబుముఖముపైఁ-గప్పుకొంటి
ఖల్గుణునిపయినాకుగో-పంబదేల॥

(భీముండురోషంబుతోబండ్లుపటపటగొరుకుచు)

ఆ॥ వె॥ పొట్టకొవ్వుబట్టి-మిట్టిపడుచునిట్లు
గొట్టినట్టివిరటుఁ-బట్టికట్టి
మట్టుబెట్టిమత్స్యపట్టణమిటమీకుఁ
గట్టిపెట్టఁగొర్కె-బుట్టెనట్టి॥

అర్జు॥ అవును స్వపరతారతమ్యమెఱుంగని విరటునిపుత్రమిత్రామాత్య బంధుసహితముగాఁబట్టి మర్దింపక యూరకుండదగదు ఆహా వాడెంత శక్తిరాతుడు ఎంతకిథినుఁడు ఎంతదురాగ్రహుఁడు.

ధర్మ॥ చం॥ విరటుమహీశుపైనలుగ-వెట్టియగాదెతలంచిచూడనా

పరుసుఁడు ముందటన్మనల-సంగతిగానదు గాక నాతనిన్
కరుణను గూఢచర్యము చో-కాటము గానెఱవేతె మీరలి
ట్లరువుగ నెగ్గులందలఁచు-టారయ న్యాయముగాదు గాదిఁకన్॥

అవ్విరటుండెఱింగినమీఁద నిట్లుజేసెనేని యప్పటికి తగినతెఱంగుజూతము మీరుకోపంబుజల్లార్చుకొని యుండండి.

(విరటుడు ఉత్తరుడు ప్రవేశము)

విర॥ కంకభట్టా మదీయసింహాసన మెక్కి నన్ను జూచియైనను దిగ్గున గద్దియ డిగ్గదలంచకుంటివి, ఇంతయహంకారమా.

అర్జు॥ [చిఱునగవుతో] ఆ॥ వె॥ ఇతఁడజాతశత్రుఁ-డిమ్మహీదిగ్విజ
యంబు జేసె నిర్జ- రాధినాథు
పీఠమెక్కఁదగిన-పెద్దయీనీచపు
గద్దెనెక్కఁదగఁడె-క్ష్మాతలేశ॥

విర॥ ఇమ్మహాత్ముండే ధర్మరాజైన భీమార్జున నకులసహదేవులును పాంచాలియు నెచ్చటుండిరి.

అర్జు॥ సీ॥ వలలుఁడనంగనీ-భవనమందుండిన
వంటలవాఁడెయీ- వాయుసుతుఁడు
అశ్వపాలకుఁడగు-నతఁడు దామగ్రంథి
నామంబుగలవాఁడె-నకులుఁడధిప
గోపాలకుఁడగుతం-త్రీపాలుఁడనునామ
ధేయంబుగొనె సహ-దేవుడితఁడు
దేవిచెంగటపను-ల్గావించుమాలిని
యనునది ద్రుపదరా-జాత్మజాత
ఉత్తరకాటపా-టోన్నతుల్ జెప్పుబృ
హన్నలయనడి నే-నర్జునుండ.

తే॥ దాయఁగా నేల ద్రౌపదీ- తరుణికొఱకు
నీదుమఱఁదుల నందఱు- నగడిగూఢ
వృత్తి గంధర్వుఁడను పేర- భీమసేనుఁ
డమితబలవిక్రములఁ జంపె- నర్ధరాత్రి॥

(విరటుండు సంశయించును)

ఉత్త॥ (విరటునితో)

సీ॥ ఇమ్మహాత్ముండు- దన్నుఁ గ జెప్పగవల
దన్న నేఁ దెల్పంగ- నలికి యొకట-
దేవసన్నిభుఁ డంచు- దెలియఁ బల్కితి గాని
నిన్న నీతండంత- నిర్వహించెఁ
దన సంగతిని దెల్ప- దనుక నే సారథ్య
మునకొప్పుకున్న న- పుంసకత్వ
మును మాని పురుషత్వ- మును బూనగాఁ గాంచి
పటిమతో నే నోడఁ- బడితి నయ్య॥

తే॥ కయ్యమున మొగమోడని- ఘనబలుండు
కురుకులోదధినింకింప- కుంభజుండు
కర్ణగర్వతటాకవి- కర్తనుండు
ఖండితంబుగ నరవరా- ఖండలుండు॥

విరటుడు చేతులు మొగిడ్చి॥

ఉ. దండము పాపనాశనగ- ధైర్యమహీతలవర్య వంద్యమా
ర్తాండసమాన తేజ మిము- ధర్మనృపాలుని గా నెఱుంగక
దండితు జేసినట్టి నిజ- దాసుని తప్పొడి వేయకండి మీ
దండకుఁ జేరితిన్ బరమ- ధన్యుని జేయుఁడటంచు వేడితిన్॥

నా నేరంబులెల్ల మన్నించి యిమ్మత్స్యపురి పరిపాలించఁబూనుఁడు.

ధర్మ॥ విరాటమహారాజా- తల్లిదండ్రి గురువు బంధువురీతి మమ్ముగూఢచర్యవత్సరంబెల్ల సాకితిరి అందుచే మేముకృతార్థులమైతిమి మాకింతియేచాలు నీరాజ్యంబును నీవేపరిపాలన జేసికొనుము.

అర్జు॥ రాజేంద్రా గతించినదానిఁగురించి యంతగా దొట్రుపాటుబడఁ దగదు.

విరటు॥ తే॥ సచివశేఖరమనతప్పు- సైరణకును
గానుకైదైనసిడవలె- గానవిప్ప
డంతిపురికేగి యుత్తర-నతిరయముగ
నెలమిశృంగారమొనరించి- యిటకుదెమ్ము॥
ఈసంగతి సుధేష్ణకు జెప్పిరమ్ము.

[మంత్రినిష్క్రమించును కల్యాణి కనకాంగి మొదలగు పౌరాంగనలు ప్రవేశము.]

కల్యాణి॥ఉ॥ మానినులార రాణెమన-మత్స్యపురంబునమారువేషముల్
బూనియు గూఢచర్యయిట- పొల్పుగఁదీర్చిరటంచు బాండురా
ట్సూనులుసచ్చరిత్రులని- శ్రోత్రములన్వినివచ్చినాముగీ
ర్వాణులతోసమానులగు- వారలఁజూచెడి పుణ్యమబ్బెనే.

కంకుభట్టే ధర్మరాజట వలలుఁడే భీముండట, బృహన్నలేయర్జునుఁడట. దామగ్రంధియే నకులుఁడట తంత్రీపాలుఁడేసహదేవుఁడట మనదేవిగారికి పరిచర్యజేయు సైరంధ్రియే ద్రౌపదియట. వీరందరు మనవిరటుని సభయందు నిజరూపములుదాల్చి యుండిరట. మనకప్పాండవుల దర్శనములభ్యపడుటజూడగా పూర్వమెన్నినోములు నోమియుంటిమో గదా యని యూహబొడముచున్నది.

కన॥ సందేహమేమి.

(సుదేష్ణ ఉత్తర ప్రవేశము)

సుధే॥ నాథా వందనంబులు.

విరటు॥ కల్యాణీ కల్యాణమగుగాక.

సుధే॥ మనయుత్తరకన్యకనలంకరించుకొని తోడితెచ్చితి.

విర॥ సంతోషము మనకన్యకామణి ధర్మరాజునకు కానుకగా సమర్పింతమురమ్మ.

సుధే॥ సమర్పించితిమేని మన వంశపావనమగుట కిసుమంతయైన సందియములేదు.

విరటు॥ తే॥ కానుకగవిరాకునుత్తర- కన్యనిచ్చి
నాడనేగన్నుమిన్నుగా- నంగలేక
సేవఁజేయించుకొనిదోష- సిద్ధిఁజెంది
యున్నదీనునిఁగౌడగృప- యుంచుఁడనఘ॥

ధర్మ॥ భూమిశ్వరా నామనఃపద్మ మానందమందినది. అర్జునుని యభిప్రాయంబెట్లుగలదో యట్లుసేయఁబూనుము.

విర॥ అర్జునా యియ్యుత్తరను కానుకగా సమర్పించితి దీనిఁబరిణయంబాడి మామత్స్యవంశంబెల్ల పవిత్రయంబు జేయుము.

అర్జు॥ (చిఱునవ్వుతో) తే॥ నృత్యగీతాది విద్యల-నెల్లనేర్పి
యున్నకతనగురుండని-యుత్తరకును
గానఁనేఁబెండ్లియాడలో-కమునసింద
పాలగుటగాకధర్మంబు- బాయునసఘ॥

మాయుత్తరకన్యకను మత్పుత్రుండగు యభిమన్యునకిచ్చి వివాహంబు జేయుము.

విరటు॥ మాకుమీనియ్యంబుకన్న వేఱొక కార్యంబెయ్యెడనైనఁగలదా మీయిష్టమగునట్లభిమన్యునకే యిచ్చిపరిణయంబు జేయుఁవాఁడ మనధర్మ జుని యభీష్టమెట్లుగలదో.

ధర్మ॥ తే॥ నరునివాక్యంబులనువిడ- నాడఁగూడ
దేలననవాతఁడుచితంబు- నెఱిగిపల్కె
నీరలిప్పుడుపుట్టాల- కీశుభఁబు
దెలియఁగాఁబుచ్చుడింకసం- దియముదక్కి॥

విరటు॥ మీయభీష్టప్రకారము జేయువాఁడ [సుధేష్ణంజూచి]

తే॥ ఓసుధేష్ణహర్ష- ముల్లంబునందిగు
రింపనీప్రబోయి- పెంపుమీరి
ద్రుపదరాజపుత్రి- విపులచిత్తంబతి
శాంతిబొందునట్లు- సన్నుతించు॥

సుధే॥ ఆలాగేజేయఁగడంగెద. (అనిసైరంధ్రిని సమీపించి)

తే॥ గొంతికోడలవంచు మే- మింతదనుకఁ
గానగాలేకబరిచారి- కాత్వమెపుడు
నిన్నుజేయించితిమితప్పు- లెన్నకమ్మ
యుత్తరనునీకుమారున- కిత్తుమమ్మ॥

సైరం॥ కం॥ ఇయ్యెడుమమ్మసాకియు
వయ్యారిని నాసుతునకు- వధువునుగా మీ
రియ్యెడఁజేసిన తప్పులు
వెయ్యైనను మఱతుమమ్మ- వియ్యఁపురాలా॥

దేవీనీమనఃపద్మంబున నావంతయైన కళంకంబుంచుకొన వలదు.

ధర్మ॥ (విరటునితో) తే॥ వసుమతీశ్వర మేముప- ప్లావ్యమునకు
బోవఁగాఁదలఁచితిమీడ-ద్రోపదుగడువఁ
దగదుద్రౌపదినచటికిఁ- దగినరీతి
వచ్చునట్లొనరింపుడీ-ముచ్చటలర॥

విర॥ ద్రౌపదిని మిమ్ములను ప్రయాణముచేసి పంపించదలఁచితి గావు
న మీరలీ దివ్యాంబరా భరణాదులందుకొనుడు [అనిఐదుగురికియిచ్చు
చున్నాడు]

ధర్మరాజు భీమార్జున నకులసహదేవులు॥ ఆలాగేగ్రహించెదము.

విరటు॥ సుధేష్ణా మనద్రౌపదిని తగురీతిఁగారవింపుము.

సుదేష్ణ॥ అమ్మా ద్రౌపదీ యీభూషణాంబరాదులు ధరించుము.

ద్రౌపది॥ ఆలాగేధరించెద.

ధర్మ॥ మత్స్యమహీశ్వరా మేముపప్లావ్యపురంబునకరిగెదము. మీ
రు వివాహమహోత్సవమునకు తగుప్రయత్నముజేసికొని మాకొకలగ్న
పత్రికను బ్రమదపఱచవలసినది.

విర॥ చిత్తము మీవెంటనేను వచ్చెదను.

ధర్మ॥ సందేహమేమిరమ్ము. [ప్రయాణమైమెల్లగాబోవుదు]

ధర్మ॥ అర్జునా యీశమీవృక్షనిక్షిప్తము శరశరాసనంబులుదగు
రీతి బూజించి తీసుకొనిరమ్ము.

అర్జు॥ ఆలాగేతెచ్చెద. (అని వృక్షమెక్కి అస్త్రంబులు తెచు చు
చున్నాడు)

[అందఱును ఉపప్లావ్యపురంబునకు ప్రవేశించిరి]

(ద్వారకలో కృష్ణబలరామసాత్యకుల ప్రవేశము)

కృ॥ అగ్రజా ధర్మజాదులజ్ఞాతవాసంబు నెరవేర్చి పరమహర్షంబుతో ను పప్లావ్యంబున కరుదెంచిరట మనము దగుఱీతిజని వారినరసివచ్చుట మంచిది.

బల॥ అలాగే పోదముపద.

సా॥ నేటికి శ్రవణానందమొందదగిన వార్తవింటిని త్వరితగతిపోదము.

(ముప్వురును నిష్క్రమింతురు)

ఉపప్లావ్యపురము ధర్మరాజాదులరంగము

ధర్మ॥ సోదరులారా దైవానుగ్రహంబుచే గూఢచర్యవ్రతవత్సరంబు నెరవేర్చి సుఖముగా ఉపప్లావ్యపురంబునకు జేరితిమి యికమీఁదజరుగవలసిన కార్యమాలోచింపవలెను.

భీము॥ (లేచి) అగ్రజా తమకెరుకపడని ధర్మాధర్మములెవ్విగలవు చే పరవారికి ముందుఁ దెలోచనజెప్పనేరితరము తమయిచ్చవచ్చిపదీతి యూనతింఁడు.

[కృష్ణబలరామసాత్యకి సుభద్రాభిమన్యులుఉపప్లావ్యపురికిప్రవేశించి ధర్మరాజుంగాంచి] ధర్మజావందనములు.

ధర్మ॥ శుభమగుగాక శ్రీకృష్ణానీవీనవరత్నసింహాసనంబుపైగూర్చుండుము.

కృ॥ అలాగే గూర్చుండెద.

ధర్మ॥ బలరామాదులారా మీరలీయుచితాసనంబుపై విజయముచేయండి.

బల॥ మంచిది.

[అని కూర్చుండిరి]

ధర్మ॥ కృష్ణా నీదగు పుత్రమిత్రకళత్రామాత్య ప్రకరంబెల్ల క్షేమంబుగానుండిరా॥

కృ॥ మీకరుణారసంబుచే నెల్లవారలు సుఖగోష్ఠినుండిరి మీరలేభంగంబులేక గూఢచర్యంబు నెఱవేర్చినందుకు చాలాసంతసించితిమి.

ధర్మ॥ మీదుగల్గ మాకేమికొఱంత

కృ॥ ఒరులకంటఁబడకుండ నజ్ఞాతచర్య నెఱవేర్చిన నీధర్మదేవతమహిమ మెంతని కొనియాడవచ్చు.

ధర్మ॥ ఆ॥ వె॥ తల్లిదండ్రిగుకుప్ప- దైవంబదాతలీ
రగుచుమమ్ముగరుణ- నరశిబ్రోచు
కతనగూఢచర్యఁ- గాఁజేసియీయుప
ప్లావ్యమునకు జేరఁ- బడితిమనఘ॥

కృ॥ మీకుదైవసహాయ మేముఱకుండుగాత యిదిగాక.

క॥ వనవాసంబజ్ఞాతం
బనువుగనెఱవేర్చినార- టంచుననే మీ
కనుమాణిమయభూషణములు
కనకాంబరములనుసంగ- గాదెచ్చితినే

మీరలీభూషణాంబరంబులు ధరించుడు (అనియిచ్చుచున్నాడు)

ధర్మ॥ త్వత్కరుణకు పాత్రులము [అనిధరించుచున్నారు]

కృ॥ సుభద్రా నీవీభూషణాంబరంబులు ద్రౌపదికొసంగుము.

సుభద్రి॥ ఆలాగే యిచ్చెద [సుభద్రి నిష్క్రమించును]

కృ॥ ధర్మజా రథగజతురగ దాసదాసీజనంబుల నపరిమితముగాఁ దెచ్చితిగాన నివియెల్ల గ్రహింపుము.

ధర్మ॥ పరిగ్రహించెద.

[సుభద్రి ద్రౌపదికడకు ప్రవేశము.]

ద్రౌపది॥ సుభద్రా వందనములు

సుభ॥ సౌమంగల్యవతివై వృద్ధినొందుము (అని ద్రౌపదిని చేరదీసికొని)

సీ॥ కటకటా పతులతోఁ- గలసి కానల కేగి
యెండ గాలికి వాన- కెప్డు నోర్చి
కొండగుహాలయందు- గోవలఁ జెలఁగాఁడి
యాఁకలి దప్పిచే- యలమటంది
చిత్తంబులోఁ గడు- చింతల కోర్చి
తేకువ చెడియెల్లు- తిరిగినావొ
కన్నబిడ్డల మీఁద (- గాంక్షను బోనాడి
యెటువలెనుంటివో- యెఱుఁగవశమె॥

ఆ॥ వె॥ తల్లిదండ్రియన్న- దమ్ములు మొదలగు
బంధుజనుల నెల్లఁ- బాసినిదు
కన్నుగవకు నెట్లు- గల్గెనో నిద్దుర
తెలియరాదు విధిరిఁ- దలఁగరాదు॥

ద్రౌప॥ అమ్మా సుభద్రా పూర్వజన్మకర్మంబు దొలఁగఁ జేసికొనుట కేరికి వశంబగు మేమెల్ల కష్టంబుల కోర్చి తిరుగ మిమ్మెల్ల రఁగని సంతోషం బుల్లసిల్ల నేటికి నుండనోమితిమి నీకొడుకును కోడలును తల్లిదండ్రులాది గాఁగల వారెల్లరును జల్లగా నుండిరా.

సుభ॥ ఎల్లవారలు సౌఖ్యముగానుండిరి నీవీభూషణాంబరంబులఁ బరితోషంబుగా ధరింపుము. (అందుకొనిధరించుచున్నది)

[ద్రుపదమహారాజు తగుబంధువులతో బ్రవేశించుచున్నాడు]

ధర్మ॥ [లేచినిలచి] మామగారువందనములు

ద్రుప॥ జయమగుగాక

ధర్మ॥ మీరలీపీఠంబుపైఁగూర్చుని యీయర్ఘ్యపాద్యాదివిధులఁ బరిగ్రహింపుడు.

ద్రుప॥ అలాగేగ్రహించెద

తే॥ అన్నదమ్ములుద్రౌపది- యటవిలోన
వంతలనుబడియజ్ఞాత- వత్సరంబు
గడపిమేలిమివచ్చిరి- కడకిఁగృష్ణ
దేవుసత్కృపమీయందుఁ- దేజరిల్ల॥

మిమ్ముదిరుగ గన్నులఁగని యానందభరితాంతరంగులమైతిమి.

ధర్మ॥ ద్రుపదభూపతీ దైవసంకల్పంబునకు వికల్పంబుఁగలుగనేరదు మేమిప్పుడ్యాపురుషుండగు విరటునికరుణారసంబుచే యీవిషమవత్సరంబతిక్రమించితిరుగ మిమ్మెల్లరఁగని కృతార్థులమైతిమి.

విర॥ ధర్మజా యిప్పురోహితులఁ బురస్కరించుకొని వివాహమునకుదగు ముహూర్తమొక్కటి రహింతబఱచుడు.

ధర్మ॥ మంచిది. బ్రాహ్మణోత్తమాశుభముహూర్తమొక్కటివిచారించుము.

బ్రాహ్మ॥ అలాగేవిచారించెద. (అని పంచాంగముజూచి)

ధర్మజా పంచమీబుధవారమురోజున నుత్తరాభి .. రతారా
బలచంద్రబలములు సంపూర్ణముగాఁ జాలియున్నవి.

ధర్మ॥ మత్స్యమహీశ్వరా
తే॥ పంచమీసౌమ్యవాసర- ప్రదమయూను
మంగుసుముహూర్తమొకటి- యుందియుండెఁ
గానపురిజాటబంపించి- ఘనతబంధు
వులకు లేఖల వ్రాయించ- బూనుడింక॥

విర॥ చిత్తము నేనుమత్స్యపురికేఁగి పురిశృంగారంబు జేయించి సకల
రాజలోకంబులకు శుభలేఖలనంపించి వివాహప్రయత్నము జేయించెద

ధర్మ॥ మంచిది పోయిరమ్ము [విరటుడు నిష్క్రమించును

[మత్స్యపురము విరటునిరంగము]

విర॥ తే॥ మంత్రిపంచమిబుధవార- మహితతిథిను
హూర్తమున్నదియంచు-ధర్మోత్తముండు
దెల్పెబహుదేశములబంధు- దివ్యమిత్రు
లందఱినియిచ్చటికివచ్చు- నట్లుజేయు॥

మంత్రిముహూర్తముచేకొనినది పురిశృంగారము జేయునియోగిం
పుము.

మత్రి॥ చిత్తము పురిశృంగారంబుజేయించి రాజేంద్రులకు లేఖలవ్రా
సిపంపించెద.

(సుగుణమణినిష్క్రమించును)విరటుండొక లేఖవ్రాయుచున్నాడు)

విర॥ సీ॥ శ్రీమన్మహారాజ- శేఖరులగుధర్మ
రాజేంద్రునకుమత్స్య-రాజు వేడ్క

~~బవంద-నాదులనొనరించి
వ్రాసినశుభలేఖ-వరుసవినుడు
శ్రీచిరంజీవులై-చెలగుశోభద్రమైన
కలిముదమొదవను-త్సవనొసంగి
పరిణయంబొగిసేయ। పంచమీబుధ
వాసరంబుననొకముహూర్తంబుగలద
టంచుసాక్ష్యులునిశ్చయించిరిప్పుడుమీరు
బంధుసపరివారబలముతోడ

తే॥ వచ్చిసుముహూర్తసంపద-హెచ్చుగాంచి
దంపతులదీవనలుఁజేసి- తగినరీతి
గారవంబందిమముబుణ్య- కరులజేయు
వారలనియావిధేయుని- ప్రార్థనంబు॥

(మంత్రిప్రవేశము.)

మం॥ రాజేంద్రా- యితరరాజులకందరకు లేఖలం బిపురిశృంగారంబుజేయ నాజ్ఞాపించివచ్చితిని.

విర॥ మంచిది యీశుభలేఖ యుపప్లావ్యపురంబునంగల ధర్మరాజున కొసంగునట్లాజ్ఞాపించి లేఖార్థవాహకునకొసంగుము.

సుగు॥ చిత్తము. (శేవకునిజూచి) శేవకా లేఖార్థవాహకుని యిచటికిబిల్చుకొనిరము.

శేవ॥ అయ్యా వానినిప్పుడేబిల్చుకొనివచ్చెద.

[శేవకుడునిష్క్రమించును]

(లేఖార్థవాహకుడు ప్రవేశము)

సుగు॥ తే॥ వాహకా యిప్పుడీవుప- ప్లావ్యపురము
జొచ్చి యాంధర్మసూనుని- జూచి మ్రొక్కి-
లేఖనాతనికొసఁగి కే- ళీగతులను
రమ్ము వేడుకబొమ్మురా- యమ్మ మీర॥

ఇదిగో లేఖ. [అని చేతికిచ్చును]

సేవ॥ నాను శలవొసంగితిరేని పోయివచ్చెద.

సుగు॥ మంచిది. (ధర్మరాజురంగము సేవకుడు ప్రవేశము)

సేవ॥ ధర్మరాజా వందనములు.

ధర్మ॥ శుభమగుగాక.

సేవ॥ పాండవాగ్రజా మత్స్యభూమండలేశ్వరుం డొకలేఖను మీకిమ్మని యిచ్చిపంపినారు.

ధర్మ॥ ఏదీ.

సేవ॥ ఇదిగో (అనిచేతికిచ్చును)

ధర్మ॥ జూచి కృష్ణబలరామసాత్యకి సాంబప్రద్యుమ్నప్రముఖాది యదుకులోత్తములారా ద్రుపదకాశిరాజాది బంధురాజప్రకరంబులారా యీ లేఖఁగలసంగతులు మీకెల్లరకు విన్నవించెదను.

సీసం— [శ్రీమన్మహారాజశేఖరుఁడన్న పద్యముచదువుచున్నాడు]

సిప

కృష్ణ॥ మేమపరిమితానంద కందళితాంతరగులమైతిమి(యోచించి)ధర్మసుహా ర్తం బాపన్నంబై వచ్చుచున్నది మనము బంధుమిత్రపరివా

విర॥ సీ॥ గ్రా మత్స్యపురము ప్రవేశించుటమంచిది యిక ప్రయాణభేరీ వే

ధర్మ॥ ఆలాగే జేయువాఁడ

(అందరునిష్క్రమించిరి)          విరటునిసంగము.

(కృష్ణబలరామసాత్యకులు పాండవులు ద్రౌపది ద్రుపదుడు ప్రవేశము)

విర॥ చూచి ధర్మజభీమార్జునకులసహదేవాద్యాత్మబంధువులారా మీరిందు గూర్చుండుడు.

ధర్మజాదులు మంచిది (అనిగూర్చుండిరి)

విర॥ కృష్ణబలరామసాత్యకి సాంబప్రద్యుమ్నాది యాదవోత్తములారా మీరీసింహాసనములపై వసియించుడు.

కృష్ణాదులు ఆలాగేనివసించెదము. [అనిగూర్చుండిరి]

విర॥ ద్రుపదకాశరాజాది రాజబంధుప్రకరంబులారా మీరలియ్యుచితాసనంబులపైఁగూర్చుండుడు.

ద్రుప॥ చిత్తము. (అనివసియించిరి)

విర॥ బ్రాహ్మణోత్తములారా మీరీలగ్నవేదికచేరువగాఁ గలయాసనంబులపైని వసించుడు.

బ్రాహ్మ॥ ఆలాగే గూర్చుండెదము.

ధర్మ॥ అ॥ వె॥ విరటభూపతీంద్ర- పరిణయలగ్నకా
లంబువచ్చెనోకకు- ణంబుసోన
తొందరగనుదంప- తులకునభ్యంగనా
దులనుదీర్చునట్లు- దెలుపుమిపుడు॥

విర॥ అభ్యంగనాదులఁజేయించునట్లాజ్ఞాపించెద. (
సేవకా విప్రోత్తములను ధర్మరాజును లగ్నముతీపర-

ని యొసఁగిరి. యీసంగతి నీవాసుభద్రకువిశదపఱచి దంపతులకు మంగళస్నానంబులు జేయించిసిద్ధముగానుంచుమని చెప్పుము.

శేవ॥ అయ్యాచిత్తము. (శేవకుని ష్క్రమించును)

(సుభద్ర అంతిపురము)

సుభ॥ సుభద్రా ద్రౌపదీ

తే॥ ఎన్నలగ్నంబుతీవ్రమై- యున్నదనుచు
బ్రాహ్మణోత్తములనిరట- వదినలార
మంగళస్నానములనుదం- పతులకిపుడు
వేగజేయించవలెరండు- వేడుకలర॥

సుభ॥ దేవీమంచిసమయమాసన్నంబైనది కానిమ్ము.

ద్రౌప॥ సుభద్రా జాగుసేయక మంగళస్నానంబులకొఱకు దగుగద్దియల దెచ్చి వధూవరులఁ గూర్చుండనియోగింపుము.

సుభ॥ కాలహరణముతోబనియేమి అట్లనేగావింతమురండి.

[అందఱు నిష్క్రమించిరి]

(అభిమన్యుని వివాహమహోత్సవము)

(కనకాంగి మోహనాంగి ప్రవేశము)

మోహనాంగీ మనయుత్తర పరిణయమట చూచివత్తమురమ్ము పరిణయ మహోత్సవము నేటితోముగిసినదని వింటిని మనము.

కన॥ నాకిదివరకు తెలియక పోయెదుగదా.

మోహ॥ తెలిసియుండి నేనేమిమూట గట్టుకొంటిని.

(రత్నాంగిప్రవేశము)

కన॥ రత్నాంగి నీవెచ్చనుండివచ్చుట

రత్నా॥ అభిమన్యుని వివాహమహోత్సవమునుజూచి

కన॥మనము ముప్పూర మొక్కసారిపోయివత్తమురమ్ము

రత్నా॥ ఎందుకు వివాహమైనది మీరేమిచూడబోయెదరు

కన॥ మేమయ్యభిమన్యునివివాహమునుగన్నులజూడనోమమైతిమిగదా

రత్నా॥ మీరుచూడలేదేమి

కన॥ మేమేమిరోజుంగుదుము

రత్నా॥ మీరెఱుంగకున్న నేనుజూచివచ్చినదాని వెల్లడించెదవినండి

కన॥ అటులైన మేముకన్నులఁజూడనోమకున్నను చెవులవినియైననుసంతసించెదముచెప్పుము

రత్నా॥ లగ్నం పాట.

మనములకానందమాయెను యభిమన్యుడు పెడ్లికొడుకాయెను

మనయుత్తర పెండ్లికూతురాయెను యఖిలమనుజులకహ్లాదమాయెను

మత్స్యేశునినోముల నెల్లఁజూడసాఫల్యమాయె॥ మన॥

పురమెంతోబన్నీరుజల్లిరి విరిసరులతోజాలరులల్లిరి

నరవరులందరు సరగునవచ్చిరి॥ మన॥

వింతగబందిళ్లువేసిరి వాటికెంతోగాఁజాంద్రీలుగట్టిరి

రంతుగముత్యాలతోరణములేర్పరచిరి॥ మన॥

వరపూజజేసిరెంతోబాగుగాసుం దరులెల్లగూడి

వేళ్లసరసిజాక్షులు హర్షంబొప్పనాడఁగ॥

పొంగుచువిప్రులంతవచ్చిరి నరపుంగవులెల్లఁగూరుచుండిరి
హంగుగఁబ్రధాన మమరంగఁజేసిరి॥ మన ॥
మాణిక్యచిత్రమైనపాత్రియందున యభిమన్యునిచరణములందున
ఘనముగనుంచిజలము లనుగడగిజల్లుకొనిరి॥ మన ॥
మధుపర్కములుదెచ్చియిచ్చిరి మనోరథమీడేరంగఁదెరయుంచిరి
విదితముగను త్తరనావేళ దోడ్తెచ్చిరి॥ మన ॥
కన్యాదానముజేయఁబూనిరి యభిమన్యునిమంచివేడసాగిరి
కన్యలందఱు వన్నెగలపాటల్‌బాడిరి॥ మన ॥
మాంగళసూత్రముగట్టెను యభిమన్యుఁడుదనచేతిబట్టెను
పొంగుమీరఁగ నుత్తరాంగనగళమున॥ మన ॥
లలితమౌకేసరికుంకుమగలయఁ గలిపినయక్షతులసొంపున
దలఁబ్రాలుపోసిరెంతో కలవాద్యములతోడ॥ మన॥
భూపాలకులు మెచ్చిచూడఁగా మంచిదీపాలపళ్లెము బాగుగా
జూచిపాటలుకడు బ్రొప్పుగఁబ్రాడిరి॥ మన ॥
ధరద్వారకాపురమందున నున్నహరిని మనఃపద్మమందున
దిరమతినెంచురీతిగా దంపతులనెంచిరి॥ మన ॥

కన॥ తర్వాత నేమిజరిగినది.

రత్నా॥ ఏమియున్నది నలుగుబెట్టుచు పాటలుబాడిరి.

కన॥ ఏదీ ఏరీతిగాబాడిరి.

రత్నాం॥ నలుగుపాట

అుత్తరపుడుదెచ్చినారి యుత్తమాంగములకు చిత్తంబలరఁగ నజూ
కుగ్రనకుత్తరకన్యకకు॥ ౧ ॥ పచ్చాకుబాగాలు మఱిబాళిమీరవగరు
కస్తురిపచ్చిపసపుచే పెంచ్చుగనలుగిడిరి॥ ౨॥ సెనగపిండిఁగలిపియా
మూరుగనకు వనజదలాక్షికి వనితామణులట ఘనముగనలుగిడి
తెచ్చి స్నానము దిన్నగజేయించి సన్నుతమగువస్త్రాభర
ౘ॥

. నదేమి.

- ౖం॥ మనయు త్తరకు కొన్ని నీతులుబోధించిరి.

కన॥ అవి మనబోంట్లు నేర్చుకొనఁదగినవేనా.

రత్నాం॥ కొన్ని నేర్చినవే యున్నవి.

కన॥ ఏవీ అవి తేటఁబరచుము.

రత్నాం॥ అప్పగింతపాట- హిం- కాఫీ- ఆదితాళము.

అత్తవారింటిలో నడకువగానుండి చిత్తమురంజిల్లఁ జేయవేమా తల్లి ॥౧॥
అజ్ఞానతనముల నేరనిబాలవే స్థిరమతినేమిపని జేశెవో సుగుణవల్లి॥౨॥
పొరుగిరుగిండ్లకు పోయికూర్చుండకే సరివారిలో మమ్ము చౌకన జేయకే॥3॥
నిద్దురలోనైన బద్ధకించకుమితర బుద్ధులాలించక సుబుద్ధినార్జించవే ॥౪॥
అత్తమామలపట్లనాడుబిడ్డలయందుచిత్తముగనుపట్టియుత్తిగిలుట మేలే॥
బావలునుఅమలు బంధుజనాళికి సేవజేసితివేని శిరిగల్గియుండువే ॥౬॥
చిన్ననాటనుండి నిన్నుగలలోనైనఁ గన్నులబెదరించ గానైతిమాయమ్మ॥
బాలామణిద్వారక పతిసాక్షినిన్నంపి యేలీలనుండఁగలమో యెఱుగశక్యమెతల్లి॥ ॥౭॥

కన॥ ఇంక నేమిదైనయుండెనా ముగించెనా

రత్నా॥ హారమునకు కొలికిపూసరీతినింత చక్కటిగలదు అదియెద్దియన.

సీ॥ అభిమన్యునకుఁబెండ్లి- యైనపిమ్మటమత్స్య
భూపతినవరత్న- భూషణములు
రుచిరాంబరములుగ- ర్పూరాద
పళ్లెరంబులను
గృష్ణాదులకునిడి- కీర్తికిగజ
శతిపీతిదగ

లక్షగోనికరంబు- లక్షదాసీదాస
తతిరెండువేలర- థంబులాది॥
తే॥ బహువిధంబగుధనరత్న- పంక్తినెల్ల
యల్లునకునరణంబిచ్చి- యఖిలజనులఁ
దగినతెఱఁగునఁబూజించి- రగణితముగ
జూడగన్నులఁబండువై- సొంపుమీరె॥

అభిమన్యునివివాహమహోత్సవమిదియ నేనుజూచినదాని సూచిచితి.

కన॥ ఆహా యేమినీ నేర్పరితనము వరుసగాఁబూసఁగూర్చినట్లుజెప్పి యపరిమిత సంతోషవార్ధి నోలలాడించితివి ఇకనిండ్లకేగుదము.

రత్నా॥ నేనుమాగృహంబున కీమార్గమునబోయెదను-
[నిష్క్రమించును]

కన॥ మోహనాంగీ మనమీరాజవీధినబోదమా
మోహ॥ అలాగేపోదముపద
(ఇద్దరు నిష్క్రమించిరి)
ఇదిగూడూరు వంశపయఃపారావార రాకాసుధాకర భారద్వాజ గోత్రబోధాయన సూత్రమల్లయాభిధ పుత్ర శివనామక విరచితంబగు దక్షిణోత్తర గోగ్రహణములు
సంపూర్ణము.

క॥ నేనీగ్రంథముజేసితి
గా శివపరు నతత్వజ్ఞుల్
ద

తులలోనరింతుర॥
సంపూర్ణము.